శ్రీ

# త్రిపురారహస్యము

(అను)

# అద్వైతసుధాసారము





రచయిత:

వైద్యవిద్వత్పండిత సత్కవి నారు నాగనార్య,
నాగవరము - కడపమండలము.

ప్రకాశకులు:

అఖిలాంధ్ర సాధుపరిష దధ్యక్షులు,

శ్రీ శ్రీ శ్రీ నిత్యానందగిరిస్వామిగారు,

శ్రీ కైలాసాశ్రమము, శ్రీ కాళహస్తి.

చిత్తూరుజిల్లా. ఆంధ్రప్రదేశము.



మూల్యము ౨-౦౦

౧౯౬౦

శ్రీ నిత్యానంద గ్రంథమాల ౩౭

౧౦౦౦ ప్రతులు



సాధారణ గీతాజయంతి.

వెల రు. 2—00



ముద్రణ :

శ్రీ బాలాజీ ప్రెస్, చిత్తూరు.

---

ప్రాప్తిస్థానము –

శ్రీ నిత్యానందగిరిస్వామిగారు
శ్రీ కైలాసాశ్రమము
ఉపనిషద్విహార్ పోస్టు
(వయా) పొనగల్ – శ్రీకాళహస్తి తాలూకా,
చిత్తూరు జిల్లా (ఆంధ్రప్రదేశ్.)

# అంకితము



సీ॥ అఖిలాంధ్ర సాధు మ-హా సభాధ్యక్షుఁడై
భూమ విద్యావ్యాప్తిఁ బొందు పఱిచె,
భూనుత "గీతా ప్ర-బోధ" సంఘాధిపు।
డైయాత్మ తత్త్వ మ-హస్సు నెఱపె,
త్రైలింగ్య దేశమం-తట। బ్రాక్త నార్షీయ
పద్ధతి సిద్ధింపఁ బాటుపడియె,
నా బాల గోపాల మవగత మగునట్లు,
భారత ధర్మమ్ము - పాదుకొలిపె

గీ॥ భాగవత జీవనమ్ము స్వ-భావ మగుట
భక్తి సస్యముఁ బండించి - పంచి పెట్టె
సర్వతో భద్ర విజ్ఞాన - సదుప దేశి !
గుణ విశేషి। నిత్యానంద ఘనమనీషి ! ౧

సత్యా నత్య విచార పారగు మనీ - షా శేషి ప్రజ్ఞాన సాం
గత్య ప్రత్యయు నార్ష ధర్మ మతివి-ఖ్యాతాంధ్ర సాహిత్య సా
హిత్య శ్రేష్ఠు నుదారుఁ ద్యాగరతు నెం-తే మత్కృతి స్వామి శ్రీ
'నిత్యానంద' మహర్షి నెంతు ధిషణా నిర్నిద్ర ముద్రాంకితున్

క॥ ఎందాఁక సత్య ధర్మము
లందఱ కాచరణ యోగ్య-మగు నందాఁకన్
సందియము లేక యీ కృతి
పొందామరవోలెఁ దెలుఁగు-పొలమున వెలుఁగున్

— సత్కవి.

# గమనిక



సర్వమత సమన్వయ సిద్ధాంత సంస్థాపనార్థమై
భాగవత జీవన పరిపోషణార్థమై
ఆధ్యాత్మిక తత్త్వ ప్రచురణార్థమై
శ్రీ గీతాప్రబోధ సంఘాధ్యక్షులచేఁ
శ్రీ త్రిపురారహస్యము

శ్రీ గీతా సుగీత మున్నగునవి ప్రకటించి ప్రచార మొనర్ప బడినవి. అఖిలాంధ్ర జనహితార్థమై చేయు నీ మహత్తరసేవ భగవత్కైంకర్యమై యలరారు గాఁత.

ఓం తత్సత్ - ఓం నయ స్తే

శ్రీ నిత్యానందగిరిస్వామిగారు,
శ్రీ కైలాసాశ్రమము
శ్రీ కాళహస్తి.



# భూమిక



## అశేష మనీషావతంసులారా!

ఓంతత్సత్ – ఓం నమస్తే.

ఈ త్రిపురారహస్యము – ప్రాచీనకాలముననే కాశీ పండితులగు "గోపీనాథ కవిరాజ ప్రముఖులచే గీర్వాణ భాషలో రచింపఁబడి పెక్కు భాషలయందునను వదింపఁబడి – తుదకు నాంగ్లేయ భాషలో శ్రీ రమణాశ్రమము వారిచేఁ బ్రచురింపఁబడినది. ఉత్తర భారతమున విస్తార ప్రచారముల కలవడిన యీ గ్రంథము – హృషీకేశ శ్రీ శివానందమహా రాజుచే బహుళ పరి వ్యాప్తి చెంది తచ్ఛిష్యులగు బ్రహ్మ శ్రీ నండూరు వేంకట సుబ్బారావుగారిచే నాంధ్ర భాష కనువదింపఁబడినది. కానీ అస్పష్ట భావములు – పేలవమగు భాషవలన దాని కాంధ్రభాషా ప్రపంచమున సలక్షణ ముద్రలభింపమిచే నీ కొఱంత దీర్పవలయుననెడి సంకల్ప మొకటి హృదయమున కల్లోల పఱచుచుండెను. తదుపరినే నొకపరి కాశికిఁ బోయినప్పుడా గ్రంథమును నాగరలిపిఁగల దానిని తెచ్చి అప్పటికేయేఁబదింటికి పైగా గ్రంథముల రచించి వెలువరించి తెలుఁగు మాగాణములోఁ బండిత లోకములోఁ పేరొందిన శ్రీ భగవాన్ రమణ మహర్షిశిష్యుడైన శ్రీ వైద్య విద్వత్పండిత సత్కవి నారునాగనార్యగారి కొసంగితిని వారచిరకాలముననే మృదు మధుర మానసీయ శయ్యా సమలంకృతముగా

సుమారు 9 వందల పద్యముల క్లుప్త సరిగా స్వేచ్ఛాను వాద మొనర్చి శ్రీ కైలాసాశ్రమమున జరగు శ్రీ శివరాత్రి సప్తాహమహోత్సవ సందర్భమున సభాముఖమున చదివి శ్రోతలనానందపఱచిరి. ఇట్లే పెక్కు సభలలో గూడ పఠింపఁ బడి బహుళాంధ్ర ప్రముఖులచే నక్షుర రామణీయక ముద్రపడ సినది. మఱియును' "బ్రహ్మవిద్యారసిక మహోపాధ్యాయ" బ్రహ్మశ్రీ మూలు పూరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు బహుముఖ ప్రజ్ఞచే శ్రోతలనానందపరవశులఁ జేయు మధురోపన్యాసములచేఁ బ్రచారసంచారము లొనర్చుచు జీవిత సర్వస్వమును దానికై ధారవోసిరి తదుపరి శ్రీ శాస్త్రిగారి అంతేవాసినియగు శ్రీమతి అంకరాజు సరోజినీదేవిగారు గురుముఖతః వినిన పాఠములను గ్రంథస్థ మొనర్ప సంకల్పించి వ్యయ ప్రయాసల కోర్చి "త్రిపురారహస్య ప్రవచనము''లను పేర ముద్రించిరి. పరమహంస పరివ్రాజకాచార్య

శ్రీ గాయత్రీ పీఠాధిపతులగు – శ్రీ విద్యాశంకర భారతీస్వాములును తెనుగు వచనములో శ్రీ త్రిపురారహస్య కౌముది పేరఁ బ్రకటించిరి. ముముక్షువులగు కొందఱు కావ్య రూపమున నుండుటెంతేని బాగని మిక్కిలి వాంఛించుటచే వారి తీరని కోరికదీర్చుట ముఖ్యమని – శ్రీ సత్కవి నారు నాగనార్యగారిని – కావ్యనిర్మాణ మొనర్పగోరితిని – ఇట్లు మలయమారుతము మాదిరి భారతదేశ మందంతటను విశేష వ్యాప్తి జెందిన యీ గ్రంథరాజము మొత్తముమీాద నుపని షత్సిద్ధాంత ప్రతిపాదకమై ఆత్మతత్త్వ సముద్దీప్తమై సంవి తదానందకందమై

కం॥ అను భూతము సూక్ష్మతర
మ్మును సులభమునైన దీని - చొప్పెఱుఁగని వాఁ
డును జనుఁడె ? యాయ భాగ్యున
కును ప్రజ్ఞలభింప దొక్క - కోటి ధనములన్

కం॥ డశివుఁ డవతరించి వానికిఁ
బ్రవిమలబోధమ్మెసఁగ్వ - వచ్చినఁ గానీ !
తపుల దుజ్ఞానము త్రిపురా
ప్రవరమహాత్త్వమ్ముఁగొనుమ - ప్రజ్ఞను గనుమా !

ఇట్టి దివ్యవేదాంత తత్త్వగ్రంథము "అద్వైతసుధాసార" మనుపేరఁ బ్రసిద్ధికెక్కినది. సకల ముముక్షుజన హితకారిణియై యలరారుచున్నది. కావున నాంధ్ర వైజ్ఞానిక లోక మెంతయేని యాదరింతురుగాత మని యాశించుచు లేఖినికి స్వస్తిపలుకు చున్నవాఁడ

సర్వేజనాస్సుఖినో భవంతు

ఇట్లు,

నిత్యానంద స్వామి
అఖిలాంధ్రసాధు పరిషదధ్యక్షుఁడు
శ్రీ కాళహస్తి.

6-6-1970
చిత్తూరు.

# ఒకనాఁటి మాట

అభిరూప శేఖరులారా -

నేటికయిదారేండ్ల క్రిందట శ్రీ కైలాసాశ్రమమున పూజ్యపాద శ్రీ శ్రీ శ్రీ నిత్యానందగిరిస్వామిగారు వచనములో నున్న శ్రీ త్రిపురారహస్య మొకదాని, నిచ్చి చదువ ముదల నిడిరి. వీరి యానతి మేరకుఁ జదివి మూలఁబెట్టితిని. తర్వాత రెండ్లేండ్లకు, నా సరస్వతీ భాండాగారమున వెదుకు నెడనియ్యది కన్పట్టెను. ఏలొకో ? మఱలఁ జదువబుద్ధిపుట్టి 5-6 పేజీలు పఠించునప్పటికిఁ బద్యకావ్యముగా వ్రాసినచో బాగుండునని తోఁచినది. వెంటనే శ్రీకారముఁ జుట్టితిని. అచిరకాలముననే పూర్తిఁజేసి గీతాజయంతి సదస్సులో ( శ్రీ కైలాసాశ్రమ మున ) బఠనమొనర్చితిని. యట్లే పెక్కుచోట్ల సయితము పఠించితిని రసజ్ఞులూకొని లలిత రచనమని వాకొనిరి. అంతట త్యాగమూర్తులగు - శ్రీ స్వామిగారు దీనినిఁ ద్వరలోనచ్చొత్తించెదనని వాక్రుచ్చిరి మఱియు నిది వ్రాయమొదలిడిన నాఁడు వ్రాయుట- నా వంతని బయలు మెఱయించుట భగవం తుని వంతనిహృదయకుహరమున బ్రతిధ్వనించెను. కడకది యట్లె పరిణమించినది. భగవల్లీలలు దురవగాహములు గదా! ఇదిగాక శ్రీ గీతానువాదమగు " శ్రీ గీతాసుగీత,నుకూడా ముద్రించి ప్రకటించిన శ్రీ స్వాములవారికి హృత్పూర్వకమగు జోహారువులొనర్చి నాఋణమీఁగఁ దలంచితిని. అధ్యాత్మ విద్యారసికులిది చదివి నెఱసులుఁ దెలిపినచోఁ గృతజ్ఞుఁడనై సవరించుకొనువాఁడ

భాషాజీవి ఇట్లు,

మీ వాఁడు - నారునాగనార్య,

ఓం తత్సత్.



# శ్రీ త్రిపురా రహస్యము



## ప్రార్థనము

ప్రణవమునకుఁ బ్రణామములను బొనర్చి
కారణానంద రూపిణీ కరమెఱుంగఁ
జేయు పరచిన్మయిన్ జగ-చ్చిత్ర చిత్ర
దర్పణాకృతి సత్కృతిఁ దలఁతు భక్తి.

## - కృత్యాది -

శ్రీ మదనంత రూపుఁడయి -
చిన్మయుఁడై, పరిపూర్ణుఁడై, జగత్
క్షేమకరుండునై, నిజ వ -
శీకృత భూతచయుండునై, సమ
స్తామల కోమలాకృతిఁ బ్ర
సన్న పరుండయి విశ్వరూప సం
క్రామ నిజాత్మ బింబిత, వి
కస్వరుఁడౌ భగవంతుఁ గొల్చెదన్ ౧

కం॥ వాకున కందక, మనసుం
బోకకుఁ బొందక, స్వయంప్ర – పూర్ణంబయి, ని
త్త్యైకమయి వెలుఁగులకు వెలుఁ
గై కంటికిఁ గానరాని యహము నుతింతున్ ౨

ఆ।వె॥ ఏదిలేక వెల్గ – దేది కల్గ వెల్గును
వెలుఁగులకును – వెలుఁగు గలుగు నెచట
నన్నిటుండుఁ దానె యన్నియుఁ దనయందె
యుండు నాదిమూల మోము జగము ౩

కం॥ పరతత్త్వార్థ గవేషణ
పరమతి నారసి ఋతమ్ము వడయఁగ వ్రాయన్
దొరకొంటి నాత్మమాహా
త్మ్య రచన, మిడియగుత, సంవి – దానందమ్మై ౪

కం॥ త్రిపురా రహస్యమని యా
దిపరాశక్త్యాత్మ బోధ దీపింప భవా
ద్యపర గదాపనుదౌషధ
ముపగత మయి తత్త్వదీక్ష నొసఁగు బుధులకుఁ ౫

మ॥ ఒకనాఁడాత్మగతమ్మునం దలఁచి బ్ర
హ్మోపాసనావేళ భౌ
తిక సంబంధ నిబంధ బంధుర నిజాం
ధ్రీ సేవకై పెక్కు గ్రాం

ధిక కావ్యమ్ముల నర్వదిలటికి పయిన్
నిర్మించియుం బారమా
ర్థిక కావ్యమ్ము రచింపనైతినని ని
ర్మింపన్ బ్రయత్నించితిన్ ౬

## — ప్రారంభము —

కం॥ నారద! భగవద్భక్తి వి
శారద! లోకత్రయీ ప్ర - చారోద్బోధ
స్ఫారదయోదార! యశః
పారద సమ! వినుమ భక్తి భావము గనుమా! ౭

ఉ॥ ఎయ్యది విన్న మానవుల
కెన్నఁడు దుఃఖపరంపరా పవిన్
డయ్యదొ! యట్టి జ్ఞానము హు
టాహుటి వల్కెద విన్మువేద సా
హాయ్యమె గాక స్వానుభవ
మై పెను పొందిన దాని భక్తిమై
యియ్యెడ శ్రద్ధఁబూని యొక
యింత పరాకును మాని నారదా! ౮

కం॥ ఇది "దత్తాత్రేయుఁడు" ముద
మొదవఁగ భార్గవుని కెపుడొ? యుపదేశించెన్
సదమల సరళోపాయ
ప్రద విజ్ఞానమ్ము సూక్ష్మ - పథ నిగమమ్మున్ ౯

కం॥ అనుభూతము, సూక్ష్మతర
మ్మును సులభమునైన దీని-చొప్పెఱుఁగవి వాఁ
డును జనుఁడె? యా యభాగ్యున
కును బ్రజ్ఞ లభింపదొక్క - కోటి భవములన్ ౯

కం॥ శివుఁ డవతరించి వానికిఁ
బ్రవిమల బోధమ్మొనర్ప - వచ్చినగానీ!
తవులదు జ్ఞానము "త్రిపురా
ప్రవణ మహత్త్వమ్ముఁ" గొనుమ ప్రజ్ఞను గనుమా! ౧౦

కం॥ 'నారదు' నంతటి వాఁడీ
సారరహస్యమ్మెఱుంగ జతను పడెను గ
స్తూరికిఁ బరిమళమెటు సహ
జారంభమొ? ధీరులకుఁ బ-రార్థమటులగున్ ౧౧

ఉ॥ "దత్తు"ని పాదపద్మము లు
దారమతిన్ భజియించి భార్గవుం
డుత్తమ తత్త్వముం దెలిసి
యొప్పె ముహూర్తము తన్మయత్వమం
దొత్తిలి పండి లేచి స్వగు
రూత్తముఁ జేరి వచించె నిట్లు స
ర్వోత్తమ దేశికా! సుఖము
నుంటి భవత్కృపఁ జేసి నేఁడిటుల్ ౧౨

కం॥ గురుఁడు భవానీ పతి గతి,
కరుణాళుండైన భక్త గణములకున్నే ?
కొఱఁతలు, బ్రహ్మత్త్వం బవ
సరమున్నే ! మరణ మనిన – సాధ్వసమగునే ? ౧౩

గీ॥ త్రిపుర మహిమను వింటి నా - దేవిఁగొలువ -
గోరికలు నీరికలునెత్తి – కొనలు సాగ
నామె నారాధన మొనర్చు – నట్టి సౌమ్య
విధి మఱెద్దియొ ? బోధింపఁ వేఁడుచుంటి ౧౪

కం॥ అనవిని "దత్తాత్రేయుం"
డనుకంపన్ శిష్యుఁ జూచి – యారాధన వి
ద్యను సాంగోపాంగము బో
ధన మొనరిఁచె శిష్యుఁడెఱుఁగఁ – దత్తద్గతులన్ ౧౫

గీ॥ "పరశురాముండు" కౌతుక – పరవశుఁడయి
గురుని యాశీస్సులంది కై -- కోలు వడసి
బయలు దేరె మహేంద్ర ప – ర్వతము సుఖ వి
కాస వినివేశమైన ని – వాసమునకు ౧౬

గీ॥ ద్వాదశాబ్దము లద్దేవి – ధ్యానపరతఁ
గొలిచి యొకనాఁడు విశ్రాంతిఁ – గూరుచుండి
యాత్మగతమున సంకల్ప – మతిశయిల్లఁ
దలఁచె నిటు లూరఁబెట్టిన – తలఁపులట్లు ౧౭

గీ॥ మున్ను 'సంవర్తి' యనునొక్క మునివరుండు
పలికెఁ ద్రిపురామహిమఁ గూర్చి - ప్రశ్నలకును
బదులొసంగుచుఁ గాని నా - యెదకదేమొ ?
విశదపడకుంట నమ్మి ని - విరతిఁ జెందె ! ౧౮

మ॥ జగముం గూర్చి తలంప బోధపడ కా
శ్చర్యమ్ముఁ గల్పించె మి
న్నగు నీసృష్టి రహస్యముం దెలియ సా
ధ్యంబౌనె ? యిద్దాని నే
వగఁ బోషింపనగున్ మఱెట్టు తుదియా
శశ్వద్విహీనస్థితిం
దగనున్కిన్ ఫలితార్థ మేమగునో ? మి
థ్యా భ్రాంతి మూలంబెదో ? ౧౯

గీ॥ అవని 'నంథపరంపరా - న్యాయ, మట్టు
లుంటఁ గతమేమి ? ఫలితార్థ - మూహఁజేసి
మనుజుఁ డొనరించు కార్యముల్ - మనుత తేఁపు
కతన సుఖ శాంతు లెట్టివి ? కలుగనోపు ౨౦

ఉ॥ తీరిక లేని కోరిక మ
దిన్ దగులూని యొకట్లొకట్లునై
పారము ముట్టరాక ఫల
వంతముగా బలవంతమూని వి

స్తారమ యెల్లవేళ కొన
సాగును గాని యొకప్పుడేని పె
ల్లాజటఁ జెందఁ బోరిటులె
యుండిన శాంతి లభించు నెన్నఁడో? ౨౧

గీ॥ ఒకటిపై రెక్క యెక్కిన -ట్లుండు కోర్కె
కంతుపంతు కనంబడ - దింతవఱకుఁ
బ్రళయమగు దాఁక నీ కోర్కె - పట్టు విడువుఁ
గనక కొనసాగు నమృత వ - ల్లి నుపమించి ౨౨

ఉ॥ కోరిక పైన కోరిక త
గుల్కొని యుండుట కేమి హేతువో?
సారసుఖమ్ము పొందుటయొ?
సంతస మందుటో? బాధలేక సం
స్కారముఁ బొందుటో? కద! ని
జమ్ముగ దీన ఫలమ్ము గల్గునే?
పేదిన నేయి చాయఁ బని
పేరుకొనున్ బలవన్ని కృష్టమై ౨౩

కం॥ నా నాటికిఁ బనిమిగులుట
చే నింకన్ జేయఁదగిన దెదియో? కలదం
చానఁ గొని చేయునటు లెం
తేనిన్ బని పాటు తగిలి - యెగపడీ పొగులున్ ౨౪

కం॥ బిరబిర గురు సన్నిధికిని
బరువిడి, తచ్చరణ యుగళి – ఫాలము సోకన్
హరుసమున మ్రొక్కి నిలఁబడి
కరుణానిధి ! నన్నుఁ బ్రోవఁ – గదవే; యనినన్ 30

గీ॥ అతఁడఁపార కృపావార్ధి – యగుట శిష్య
చంద్రముని జూచి కరుణా ర – సమ్ము పొంగ
డగ్గఱకుఁ జేరఁ జీరి బి – డ్డా! యిటేల
వచ్చితివి చెప్పుమా! యని – పలికినంత 3౧

కం॥ గురువర ! సంసారార్ణవ
పరిమగ్న విపత్ప్రలాప – బాధితునకుఁ ద్వ
న్నిరుపమ నౌకా సాహ్యం
బిరవందఁగ గట్టుఁ జేర్ప – దే! యని యెంతున్ 3౨

కం॥ నావుఁడు నీ సంశయ మెది
యో! వేగమ పలుకు మెట్లొ ? యుక్తిని దీర్పం
గావించెదఁ దనిసని యా
పై విధ్యుక్తములుఁ దీర్ప – వలఁతివి గావా! 33

కం॥ సెలవయిన విన్నవించెదఁ
గలకాలము నుండి యెడఁదఁ గారించుచు వ్యా
కుల మిడు సంశయ కంటక
ములు వెలలింపఁ దగుఁ దట్టు – ముట్టాడు మదిన్ 3౪

కం॥ అని చాఁగిలిపడి కనుఁగవ
దొనదొనమై యశ్రుజలముఁ దోతెంచిన గ
న్గొని రెండు చేతు లొకయూ
పున లేవఁగ నెత్తి భయము – వో, నభయ మిడెన్ 3౫

గీ॥ వత్స! యిట్లేల? దుర్వార – వారిరాశి
మగ్న పరితప్తహృదయుని – మాడ్కి వగవ
వలదు నీ కేల? నేనుండ – భయమటంచు!
భద్రవాక్యమ్ము లాడినఁ – బయికి లేచి 3౬

శా॥ దేవా! కోపము రూపమెత్తి నృపులన్
దీవ్రాజిలోఁ ద్రుంచి యెం
తే విధ్యుక్తగతిన్ బితాళ్ళ కెలమిన్
నిండించితిన్, మున్ను మి
ఖ్యావీరమ్మున రామునిన్ గనఁగ నం
తర్వైర ముద్వృత్తి రా
వే వేగన్ రఘు వల్లభుం డడఁచె ను
ర్విన్ గర్వ ఖర్వమ్ముగన్ 3౭

ఉ॥ పాఱుఁడ నయ్యుఁ గావరము
పాలవు నన్నుఁ గృపాప్రపూర్ణుఁడా
శ్రీ రఘురాముఁ డప్డు విడి
చెన్ గొన యూపిరి తోడ నోటమిన్
గూరి వి చారముం గలిగి
కోనలఁ ద్రిమ్మరు నప్డుఁ గంటి రా
వారిని నొక్క 'సంయమిని'
దత్త్వ సమీక్షకు వ్యాఖ్యయో యనన్ 3౮

కం॥ ఆ 'సంవర్త' మునీంద్రు ని
తో సంప్రశ్నము లొనర్పఁ! దోత్తో బదులెం
తే సముచిత గతి నొసఁగిన
గీసర మది నెఱుఁగ నైతిఁ - గించిత్ జ్ఞతచే ౩౯

ఆ।వె॥ పూసఁ గ్రుచ్చినట్టు - లా 'సంయమీంద్రుండు'
వలుక నెఱుక లేక తెలియనైతి
నిప్పు డలఁతి తెలివి - తెప్పుజీల్లుటఁ జేసి
నాఁటి బోధ మఱి వి - నంగ వలఁతు ౪౦

కం॥ నా నా విధ సత్కర్మలు
దానమ్ములు ధర్మములు య - థావిధి సేయన్
బూనిన కడకవి భక్తి ని
ధానములయి - యిట్టి మంచి - దారిన్ జూపెన్ ౪౧

వ॥ ఈ మార్గమ్ము పరంపరా సాధనోపాయక్రమమ్ము నిరపాయ
కరమ్ము భవ నిరయ నివారకమ్ము బహు జన్మ సంప్రాప్త
ముక్తి విధానమ్మగుం గాని సరాసరి యేకధాటిగా నుపలక్షింప
నయితిఁ గామింజేసి తత్త్వ సమీక్షా సమక్షమున నందులకు
వలయు రాజమార్గ మెఱుంగఁ గోరి గురు సన్నిధిం జేరి
విన్నవించు దాసాను దాసుని దయారస పరిప్లావిత హృదయ
మ్మున నన్నొక శిష్య మాత్రునిగాఁ జేరంజీరి భవనిర్ముక్తి
యగు విముక్త పథం బెఱుక పఱుపఁ బొరింబొరి వేఁడి కోఁనిన

శా॥ ఆ 'సంవర్త' మునీంద్రుఁడేమని యుప
న్యాసమ్ముఁ గావించె వి
ద్యా సౌశీల్య గుణప్రభావిత తపో
ధ్యానాదు లెట్లుండునో ?
యా సందర్భము లానుపూర్వి విని నే
నాలోచనల్ సేసి సం
తోసమ్మున్ బురికొల్పు సెయ్వుల సము
ద్భూతమ్ముఁ గావించెదన్ ౧౩

చం॥ అన విని 'భార్గవుండు' విన
యావనతాననుఁడై మహర్షి చెం
తను నిలుచుండి భక్తి పర
తన్ గడు నిశ్చలుఁడై మనుష్య లె
ల్ల నడచు జాడ వీడి యతు
లమ్ము నవీనము నిర్భయమ్ము నై
పనుపడు దారిలో నడచు !
పాంథుని వోలె మెలంగ నయ్యెడన్ ౧౪

గీ॥ సకల భూతమ్ములను గృపా - స్వాంతమూని
బాధలకు యత్నములకు సం - బంధ పడక
యింకనేమేని పనిలేదు - లే ! యటంచు
హాయి మెయి నిశ్చల జ్యోతి యయి వెలుంగు ౧౫

కం॥ పని యింకను గలదను భయ
మును గూర్చెడి క్రూరసర్ప - మున కొగి నను లోఁ
గొనఁ జేయకుఁ డెటులైనన్
బనివడి తప్పించుటయె శు- భప్రద మనుచున్ ౧౬

ఆ|వె|| వన్నె వాసిఁ జూచి - బంగారు బేహారి
సరకుఁ గొనిన యనువు - జామదగ్ని
భక్తి వినయములకు - రక్తి నెమ్మది బ్రమ్మి
చేరఁ జీరి పలికెఁ -- జిన్ని పలుకు ౪౭

కం|| జమదగ్నికుమారా! స
క్రమ మార్గ చరిష్ణులై ప్ర - కారాంతర ము
ల్లము మారు ట దృష్టము కా
నము నూటికొకండు నైన నవ్యోత్సాహీ! ౪౮

ఆ|వె|| సంద్ర మందు మునుఁగు - జనుఁడు నౌకం గను
పోల్కి పూర్వ జన్మ - పుణ్యమున ల
భించు భక్తి భావ - మంచిత గతి నెల్ల
వారి కెట్లుఁగల్గు - బ్రాహ్మ్యబుద్ధి ౪౯

చం|| ఎవఁడు మహిష్ఠ భక్తిఁ గల
డెవ్వఁడు గట్టిగ నమ్మియుండునో?
యెవఁడు సమర్పణాత్ముఁడయి!
యెల్లపుడున్ త్రిపురా పదాంబుజ
స్రవణ మరంద ధారల ర
సాయన మట్లుఁగొనున్ నిజమ్ముమా
నవుఁడతఁడే జనించు జన
న ప్రగతిన్ సుకృతీడ్యుఁ డాతఁడే! ౫౦

గీ॥ క్రూర మృత్యూగ్ర దంత ని - గూఢ నిశిత
భయద కీలలఁ జిక్కి కీ - డ్పడిన నరుఁడు
పరమ తత్త్వ విచార సం - పదలఁ బొదలి
మెఱయు నమృతత్త్వ సిద్ధియున్ - సిరులు దొరలి ౨౮౧

గీ॥ మంచి చెడ్డల గుర్తించు - మాట మఱచి
స్వార్థ మొదల మోసి యా - శాలతా ని
బద్ధుఁడై యింకనుం జేయ - వలసిన పని
యనెడి యహిదష్టుఁడై చెడు - నన్నికదల ౨౮౨

కం॥ దీనికి దృష్టాంతము విను
మా! నిర్మలమతి నరణ్య - మార్గాయాసం
బూని క్షుధా పీడితులగు
మానవులే ముసిఁడి పండ్లు - మామిడు లనుచున్ ౨౮౩

చం॥ తిని మద మెక్కి యొండొరు మ
తి భ్రమణమ్మున వాదులాడి కై
పును విడగొట్టు నట్టి ఫల
ముల్ వలె నెంచుట నుమ్మెతల్ గనుం
గొని లికుచమ్ము లంచుఁ గయి
కొంచు వడిన్ దిన నామువేఁగి బు
ద్ధి నియతిఁ దప్పి కొట్టుకొని
తిక్కట మక్కట గాయముల్ వడం
గను చెడి దారిఁ దప్పి నటు
కాఁగల దాని భజింత్రు మోఱకుల్ ౨౮౪

కం॥ ఇఁకఁ జేయవలయు పని యని
కకవిక పాటున జడుండు — కానివనుల్ తే
రకు నౌదల నిడుకొని యూ
రక చెడు క్షుత్పిపాస్యజడుల — క్రమమున మివులన్ ౫౫

కం॥ పరమార్థ విచారణమున
పరతత్త్వముఁ దెలిసి కొనఁగ బహుసులభము భూ
ధరశిఖరి కెక్కనిచ్చెన
కురవగు తొలిమెట్టు వోలె — నునికిం దెలుపున్ ౫౬

వ॥ అది యెట్టులనిన ౫౭

గీ॥ దూరదృష్టిని లేమి మృ — తుండు నగును
మంచి యాలోచనమున జ — యించు జగము
బుద్ధిసూక్ష్మత గల రామ — మూర్తి గూడ
దీర్ఘయోచనలే — మిబాధితుఁడు నయ్యె ౫౮

గీ॥ మంచి యోజించి వార్ధి బం — ధించి యసుర
సమితి నిర్జించి జయముఁ బ్రా — పించె రాముఁ
డెంచరాని వరమ్ముల — నిచ్చి తానె
వారికయి తలఁ ద్రుంచుకో — వలసె బ్రహ్మ ౫౯

కం॥ కాన విచారణ మొనరుప
లేని నరుల్ సెరగులకు బ — లియగుదురెద ని
ల్పాని విచారణ మొనరుచు
మానవులిఁక సౌఖ్యవార్ధి — మగ్నులుఁ గారే! ౬౦

కం॥ ప్రతి విషయ మెఱుఁగఁదగు నను
మతి యిసుకయెడారి నీరు - మాదిరి రిక్త
స్థితియగు యోచన కొదవని
మతి, భగవత్కృపకుఁ బాత్ర - మాడ్కిఁ దనర్చున్. ౬౧

గీ॥ అంధకారమ్ము మాయింప - నర్కదీప్తి
యవసరంబట్లు భగవత్కృ - పామృత ప్ర
సార మవసరమగు నవి - చారణమ్ము
డంచి సువిచార పథము గ - న్పించుటకును. ౬౨

గీ॥ సుఖము గోరి విచారణ - శూన్యమున శ్ర
మంకరావధులను సుఖ - మయము నాఁ ద
లంచి భవ దుఃఖమను మంగ - లమున వేఁ పఁ
బడిన విత్తుల వోలె గా - ల్పఁబడు నరుఁడు. ౬౩

కం॥ అని గురుసూక్తిఁ "బరశ్వధ
ముని" విని, భక్తి ప్రపత్తి మునివల్లభ! తా
మను కంప వినిచినది స
త్య నిరూఢము గాఢతత్త్వ - దర్శనము సుమా! ౬౪

గీ॥ మనన నిష్కర్ష మతికిఁ బొ - ల్చును సుఖమ్ముఁ
గానఁ ద్రిపురా మహిమ వల్ల! కలుగునది, య
టంచు నెఱిఁగితి గురుకృప - యబ్బెనేని
సందియపు మేకు విడు డెంద - మందు నుండి. ౬౫

కం॥ త్రిపురాదేవీ మహిమయె,
యెపుడు విచారింపకుంట – కేహోతువా ? యీ
వ్యపగతికిఁ గతమెదియో ?
యిప్పుడేని యనూహ్యమగుట – కే కారణమో ! ౬౬

కం॥ అనవుండు 'జామదగ్నికి
వినిపించెన్ దుఃఖవితతి – విటతాటమునై
ఘనచిత్సుఖ మలము తెఱం
గును గూర్చి సవిస్తరమ్ము – గురుతత్త్వమ్మున్ ౬౭

గీ॥ 'ముక్తచూడ' సమాఖ్య నృ – పుండొకండుఁ
గలఁడు 'మణిచూడ' హోమచూ – డులను సుతులఁ
గూడి నిజరాజ్యమేలుచుఁ – గూడిమాడి
యాత్మజులు వేఁటకై పోయి – రడవి కంత ౬౮

కం॥ ధీరులగు వారు శౌర్య
స్ఫార పరాక్రమముఁ జూపి – చంపిరి పులులన్
గాఱెలుగుల సింగముల న
వారి మెకమ్ములను గాడు – పఱచిరి వనమున్ ౬౯

ఉ॥ అట్టి యెడన్ 'దపాను' పొల
మంతయు ఱేఁగి దుమారమున్ దెసల్
సుట్టి కనుంగవన్ దెఱచి
చూడవశమ్మును గాక ! భీష్మమై

యట్టిటు కార్మొయిల్ సెదరి
యాకస మంతయుఁ జిమ్మచీఁకటుల్
పట్టినృపాత్మజుల్ సెదరి
పాఱిరి చెట్టుకుఁ బుట్టకొక్కఁడై ౨౦

మ॥ ఘటుకెల్లన్ విటతాటమై నృపసుత
ద్వంద్వమ్ము ఘోరాటవిన్
బటువాతూల చలద్ద్రుమ భ్రమణకృ
ద్వ్యాప్తిన్ విడంబించి యె
చ్చటఁ జూడన్ గనుపింప కొండొకనితో
సంబంధమున్ లేక ది
క్తటముల్ దాఁకిరి పెద్ద గాలికెరయై
కారా కులం బోలుచున్ ౨౧

ఆ॥వె॥ అందు 'హేమచూడుఁ' డటనటఁ దిరుగాడి
యొక్క యుపవనమ్ము చక్కిఁ బోయి,
నందనోపమిత వ - నమ్మున దిరుగు రం
భోరువొక్క రంభ - తీరుదాని ౨౨

గీ॥ మిసిమి పసమించు నొడలు పెం - పెసఁగు దాని
తొలకరి మెఱుంగుఁ దీవనాఁ దోఁచుదాని
సోముగోమును నేమించు - మోముదాని
నాశ్రమాంతర మునికన్య - నతఁడుఁగాంచె ౨౩

కం॥ అబ్బుర పాటున మది త
బ్బిబ్బై యబ్బోటి తోడ - బిబ్బోక వతీ!
గబ్బి తనమ్మిదియగు నో
యబ్బా! కాఱడవి నొంటి - యై యిటులుంటన్ ౨౪

కం॥ ఘోర మృగా కీర్ణము భయ
దారణ్యమునన్ నివాస - మై యుండుటకున్
గారణమేమో? తెలియదు,
వారిజదళనేత్ర! పల్క - వలె నాకనుచున్ ౨౫

వ॥ నూతన పరిచితయగు నాసుచరిత చరిత మానుపూర్వ్య
మెఱుంగఁదహతహపడుచున్న నట్టి పట్టున ౨౬

కం॥ సుడిగాలి సుడిసి బడలిన
యొడలన్ విడుమర ఘటించు - టురవు తెరువరిన్
బడలుడుగుట విధ్యుక్తం
బడరున్ విశ్రాంతిఁగూర్తు - నాశ్రమ సీమన్ ౨౭

కం॥ జనకుండు లేని యెడ వ
చ్చిన యతిధికి సుత సపర్య - సేయు టుచితమం
చును మది నెంచి పొరింబొరి
మనుజపతిన్ దగ్గఱించి - మడఁతియిటులనెన్ ౨౮

గీ॥ స్వాగతము రాజచంద్ర! యా - సనము మీఁదఁ
గూరుచుండు టతిథిపూజఁ గూర్చు టెందుఁ
దాపసుల ధర్మమగుఁ గదా! - దయఁ దలిర్ప
నస్మదాతిథ్య మొక్కింత - యందు కొనుఁడు ౨౯

వ॥ తదుపరి నారాజకుమారుడు దీర్ఘమాలోచించి తపోభూమిఁగల నీశోభనాంగి యెవ్వతెయో? తెలిసి కొన నుత్సహించిమెల్లన చల్లని తీపి పలుకులతో నో మునికుమారీ! నీచరిత్ర మాను పూర్వ్య మెఱుంగ నభిలాష కలదు. ఆమూలాగ్ర మెఱుంగఁ బలుకుట కెట్టి యభ్యంతర ముండదని యనునయ వినయమ్మున మనోభిమతమ్ము నివేదించిన ౮౦

గీ॥ అవల నవలా సభక్తితో - నారముగ్గు
పండ్లు గోక్షీరమునను దృ - ప్తాత్ముఁ జేసి
మిపులఁ బ్రేముడి దరిఁజేరి - తవులు పాటు
లేని మర్యాద నృపు కడ - లేచి నిలిచి ౮౧

గీ॥ నిశ్చల తపోవిభూతి మా - నిత యశోవి
నీతిఁ గల "వ్యాఘ్రపాద" మౌ - ని వరుఁ డరయఁ
బెంపుడు కుమార్తె నేను నా - పేరు - "హేమ -
లేఖ" యస్మచ్చరిత్ర మా - లింపు మార్య ౮౨

మ॥ మును "విద్యుత్ప్రభ" నా వియచ్చర యిటఁ
బూతాంబు సుస్నాతయై
చన వంగావనినేత నామెఁ గని వి
స్ఫారాత్మ జామోఘ బా
ణ నిపాత జ్వాలదుగ్రగ వహ్ని కెరయై
నన్ దత్సమావేశ సం
జనిత ప్రాణిని నేను తల్లి యపుడే
స్వస్థానముం జేరినన్ ౮౩

శా॥ స్నానార్థం బిట వచ్చి "వ్యాఘ్రపదుఁ" డి
చ్ఛాస్ఫూర్తి నన్ గాంచి ది
క్కైక న్లేని నిసుంగుఁ బ్రోచుటది పు
ణ్యం బంచు భావించి యెం
తే నన్నాలన పాలనమ్ములను బో
షించెన్ ఘటించెన్ మది
చ్ఛా నైశిత్య పరార్థ సంయమన దీ
క్షా దక్షతన్ భూవరా ! ౭౨

కం॥ అమ్ముని తపోబలమ్మున
ద్రిమ్మర రిచ్చోట నెట్టి – తెంపరు లగు ధీ
రమ్మన్యులు మతిశూన్యులు
నెమ్మెయి రక్కసులు నైన – నేక్షణమైనన్. ౭౩

కం॥ అని వినిచిన దద్రూపముఁ
గని మనసిజ నిశిత బాణ – కాండముఁ గ్రువ్వన్
మనసోర్వక, తన యభిమత
మును దెలిపిన "హేమలేఖ" ముసిముసినగుచున్ ౭౪

వ॥ అంత నచ్చట విచ్చవిరియు పెక్కు మహిమో పేత విషయ
మ్ములఁ బూసఁగ్రుచ్చు మచ్చున హెచ్చరి కించుచు నమ్మ
చ్చెకంటి యమ్మహారాజుతో నిట్లనియె – ౭౫

కం॥ వెఱపేల విశ్రమింపుమ
యరగడియ కు లోన వచ్చు – నస్మత్పిత నీ
తెఱఁగెఱిఁగింపుమ, యావల
జరుగు విధానమ్ముఁ గనుమ ! సర్వేశకృపన్. ౧౮

వ॥ అంతఁ గొంత కాలమ్మునకే యాశ్రమసీమ విడిసి ౧౯

కం॥ వారిద్దరొద్దికను నిజ
చారిత్ర్యము లానుపూర్వ్య – చర్చావసర
స్మేరాస్య కమల వికసత్
ప్రారంభుల రగుటఁ జూచె "వ్యాఘ్రపదు" డటన్. ౨౦

చం॥ నిలువున లేచి మౌనిపద
నీరజ యుగ్మము నాచి వందన
మ్ములుఁ బొనరించి యాత్మకథ !
బూర్ణముగా వివరించి రాజులోఁ !
గల తలఁపుల్ జపించి వడి
గా మునిచిత్తము నెక్కఁబల్కె న
త్యలఘు సమాగమమ్ము హృద
యంగమమై కడు సంతసించుటల్ ౨౧

ఉ॥ చక్కని వాఁడు రాజకుల
చంద్రుఁడు యౌవన పట్టభద్రుఁడున్
మిక్కిలి ప్రేముడిన్ గలుగు
మేటి దయాగుణవర్ధితుండు స

సమ్యక్కవిరాజ పూజితుఁడ
మాంతము సొంతము శాంతిదాయి యం
చక్కఁఁబయైన వాఁడని ధ
రాధిపు మెచ్చి హృదంతరమ్మునన్ ౬౨

గీ॥ "వ్యాఘ్రపద" డాత్మజ నొసంగె నతిముదమున,
పితరు నానతిఁ దలఁదాల్చె నతులభక్తి
"హేమలేఖ" నృపాలు! డా "హేమచూడ!"
భూపుఁడు గృహస్థుఁడగుటకు – ముదముసెందె. ౬౩

గీ॥ "వ్యాఘ్రపాదుండు" "హేమలే – ఖా"భిధాన
రాజవరు చేతఁ బెట్టెఁ దో –రమ్ముఁ గ్రమ్మ
నెంతసాకిన నాఁడు వా – రెపుడొకప్డు
పుట్టి నిలు వీడి పోదురు – మెట్టినిల్లు ౬౪

ఆ॥వె॥ అపుడ "హేమలేఖ" యారాజచంద్రుని
జెట్టవట్టి వదలెఁ – బుట్టినిల్లు
నూత్నదంపతులు వి – నోదమ్ములను మది
మదిఁగఱంచు పనులఁ బొదవిరంత ౬౫

చం॥ అసమ పరాక్రమక్రము ల
నంత యశోవిభవుల్ మనోజ్ఞ వ
స్తు సముదయార్జితోర్జితులు
దుర్భర కార్య విచక్షణోత్తముల్

కుసుమ శరాభిఘాత వశ
గాఢ మనోవిభవుల్ నరాధిపుల్
వసతులఁగారె! భౌతిక వి
వర్ధన కామ కళానుభూతికిన్ ౬౭

కం॥ రారమ్మని పిలుచును బహు
ళారామ విహార సౌఖ్య - మనుభూతికినై
యారామ, యుచ్చగింపమి
మారాములు సేయు నృపుఁడు - మదనోపహతిన్ ౬౮

గీ॥ మదన కదనానుభూతి సం - పదలఁ బొదల
నెదగదించును రాజు నా - "హేమలేఖ"
మదని సుతరాము నిష్టప - డదు రవంత
యాత్మగళ్ళను వచ్చె భే - దాభిమతము ౬౯

కం॥ పొరపొచ్చె మిర్వురకు సం
బరమున బద్ధానురాగ మైత్రిఁ గలుగనాం
బోడ తెపపడి తెలిసి పర
స్పర భిన్న మతమ్ముఁ జక్కఁ బఱచు కొనుటకై ౭౦

ఉ॥ శారదరాత్రి లక్ష్మి మన
సార, హసించిన యట్లు పిండి నిం
డారఁగఁ జల్లినట్లు పొద
లంతట మల్లెలు బూచినట్లు వి

స్ఫారము తెల్లువిచ్చినటు
జాదులు నోరెడఁ జాఁపినట్లు సిం
గారము రంగరించినటు
క్రాలెను వెన్నెల తేయి హాయిమై ౧౦౦

కం॥ ఒకనాఁటి తేయి దంపతు
లకు నిటు సంవాదమెసఁగె – లలితోక్తులతో
జిలిబిలి వెలఁది వెలుంగులుఁ
దొలఁక స్మితాస్యముల నొకరి – తో నొక రొకటిన్ ౧౦౧

కం॥ మంతనమున సీమంతిని
జెంతకురాఁ బిలిచి, ప్రేయ – సీ! విషయ సుఖం
బింతయుఁ గోరని నీమత
మెంతుఁ జమీ! రాగ చిహ్న – మిది యని మదిలో! ౧౦౨

గీ॥ ప్రేమ నామీఁద గోముమై – పెంచినట్లు
గానఁబడి విషయాసక్తిఁ – గాంక్షలేని
దానివలెనుంటకేది? హే – త్వంతరమ్ము
నిజము – నాతోడు! పలుకుమా – నీరజాక్షి! ౧౦౩

కం॥ ఆసక్తి లేని చెలిసా
వాసము చప్పనగుఁ గూర – వలె ననుభవం
బై సుఖదూరమ్మయి పే
రాసకుఁదావైన లేక – యడఁగారుఁ జమీ! ౧౦౪

కం॥ నినుఁగౌఁగిలిలోఁ గొనుతఱి
నసురక్తిని బల్కరించి – నప్పుడెటో ? పో
యిన మదివలె నుందువు వె
న్కొని యెఱుఁగని ప్రశ్నవేసి – కూర్చుందువహా ! ౧౦౩

కం॥ నేనెప్పు డేమిచేసిన
దానిని గమనింపకయె య – థాస్థితి నచల
ప్రాణి వలె వెలయు దావల
నానియతుల నిరవలంబ – నత నడుగవాకో ! ౧౦౪

కం॥ ఎడపెడ మొగమై యాల్మగ
లడరిన సుఖమెట్టులబ్బు, ననుకూల మతిఁ
దొడరుఁగద హాయి; లక్ష్యం
బిడని నినుఁ గూడ సౌఖ్య – మెట్లగును జెలీ ! ౧౦౫

కం॥ నీకోరికఁ దీర్చుటకై
యేకాండము వేచియుందు – నేనిముసమ్ముఁ
నీకై వెచ్చింతును శశి
యా కౌముదిఁ బాసి యుండు – నా ? క్షణమయినఁ ౧౦౬

కం॥ ప్రాణమ్ము కన్నఁ బ్రియమై
మానించిన నిన్ను వీడి – మనఁగలనే ? చం
ద్రానన ! సందియ మొందఁగ
నౌనే ? నాకెఱుక పఱుపు – మా ! నీకోర్కుల్ ౧౦౭

కం॥ తరుణీ! నీకొఱ కగ్గని
సుఖకుదు, కట్టిడుములైన - నోర్చుదుఁగడకీ
నిరుపమ జీవము లయినను,
హరియింతును లెక్కసేయ - కాత్మార్పణగా ౧౧౦

కం॥ ప్రేమాలింగన సుఖవశ
కామనుఁడగు భర్త పలుకు - గౌరవ మెసఁగన్
"హేమ" నిజభర్త దగ్గఱి
ప్రేముడి తన మల్ల నల్లఁ బ్రేరేఁచు మదిన్ ౧౧౧

కం॥ నాయనుఁగుం జెలికాఁడా!
మీయం దెంతేని భక్తి - మెండొడ్డుదుఁ గా
నీ! యెది? ప్రేమింపందగు
నేయది? ప్రేమింపఁదగదొ? యెఱుఁగఁ దపింతున్ ౧౧౨

కం॥ ఏతద్విషయ విచారణ
చేతన్ తేఁబవల దొక్క - చింతన యయ్యెన్
ధ్యేయ ఫలమెద్దియో? నా
దా! యోచన కందిపొంద - దదియే మందున్ ౧౧౩

ఆ॥వె॥ ఆఁడుదాన నగుటఁ గూడిన సంశయాల్
దీర్పఁ జాలనైతి - ధీరపురుష
వరుఁడవైన తామె - బలు సందియముఁ దీర్చి
నన్నుఁ బ్రోవ వేఁడు చున్నదాన! ౧౧౪

వ॥ అనిన విని యెడలెల్లఝల్లన నిడివి తడవు యోజించి యోజించి పక్కున నగి ప్రియురాలిఁ గుస్తరించు నెపమ్మున లీలా మాత్రమ్ముగాఁ గించిత్పరిహాస భాసురుండయి – ౧౧౫

ఆ।వె॥ 'హేమచూడుఁ' డనియె – నీలాగు – స్త్రీలెంత
తెలివిలేనివారొ ? తెలిసి కొంటి
ప్రేముడింపఁ దగునొ ? ప్రేమింపఁగూడదో ?
జంతులేని యెఱుఁగు – వింత యొక్కొ ! ౧౧౬

ఆ।వె॥ ఇష్టమున్న యెడకు – నేగు నిష్టము లేమి
సాగుఁ బశువులేని – సౌఖ్యమునకుఁ
బ్రియము వడుట యొప్పు – వేదనఁగలిగించు
తెరువుఁ బఱవ కునికి – తెలివి గాదె ! ౧౧౭

మ॥ నగ వొప్పారఁగ 'హేమచూడుఁ' డిటు లో
నారీమణీ ! సృష్టి నై
జగతిన్ వెల్గ విచార మేమిటి కనన్
సమ్యక్ప్రబోధమ్ము లి
మ్ముగఁ బొల్పొందిన వెన్క నిన్ దరిసి నే
భోగింపనే, సంశయిం
పఁగ నేలా ! సువిచార లబ్ధ మహామా –
ప్రత్యక్ష సాక్ష్యమ్మునై ౧౧౮

వ॥ మఱియుఁ బ్రసన్న చిత్తమ్మున నవధరింపుఁడు ౧౧౯

చం॥ ఇఁక సుఖ మిచ్చు వాని గ్రహి
యించి శ్రమంకరముల్ త్యజింప భౌ
తిక హితమంచుఁ బల్కితిరి
దేశము కాలము పాత్ర మొక్కదా
ని కడ విభేదమూను నగి
నిఁ జలి వేళ సుఖమ్ము గాఁగ నెం
డకు విపరీతమట్టు లగు
టల్ సహజమ్ములు సుమ్ము భూపతీ ! ౧౨౦

కం॥ శీతల తను వాతపమున
బ్రీతివడుఁ శీతలమ్ముఁ - బ్రేమింపరె యు
ష్ణాతిగ తనువులు వస్తు వొ
కే తీరున వెల్గ భేద - మెందుల కొదవెఁ ౧౨౧

కం॥ ధన ధాన్య దార పుత్త్రులు !
గను రాజును దుఃఖజలధి - గత్తైఁయుఁగక, కుం
దును బొంద, దరిద్రుం డిఁక
ఘన సౌఖ్యము లందు టేమి - కారణము ? నృపా ౧౨౨

కం॥ సకలముఁ గలిగిన దుఃఖము
ప్రకటము గాదనిన, నది యు - పాలంభమగున్
ఒకకొన్ని యున్న వాఁడును
సుకమందఁగఁ గతమదేమి ? సూక్ష్మముఁ గనుమా ! ౧౨౩

కం॥ కోరికల కంతులేదు, గ
దా! రాజా! యవి లభింప - నప్పుడు బాధల్
మీరును వాంఛా బీజాం
కూరమె, పెను చెట్టుఁగాదె! గుఱుతెఱిఁగినచో? ౧౨౪

కం॥ సురలు సురాధిపుఁడును రా
తిరి పవలున్ గోరికలను - దేవురుగొట్టై
నిరసింపఁ బడరె! మఱియె
వ్వరు? కామ్యార్థులయి బాధ - పడరు కడంకన్ ౧౨౫

గీ॥ మానవుల కంటెఁ బశ్వాదు - లైన మేలు
సౌఖ్యమును గాంచుటం దిఁక - జనులు సతము
కొల, మునుంగుదు రెంతేని - కోరికలను
మేరలను దాటు కోర్కులు - తీరు కొలఁది! ౧౨౬

కం॥ ఎది సుఖమందురొ? బాధయె,
యది, బాహ్యాంతరము లని, ద్వ - యం బలరారున్
మొదలింటి దాని మించున్
గద! యంతర బాధ, దుఃఖ - కారణ మగుచున్ ౧౨౭

కం॥ తీరని కోరికలను మదిఁ
బారము ముట్టుటెటు? భోగ - పరుఁడగు వెనుకన్!
భారవహ వృషభ నిభ మయి
సారేతర వృత్తి నుంట - సౌఖ్యమె, చెపుడా? ౧౨౮

కం॥ మనుజుఁడు సుఖమును బొందిన
వెనుక మఱల మఱలఁ గోర్కి - వెంటాడుటచేఁ
గన నది సుఖ మెటులగుఁ? దృ
ప్తిని గాంచిన వెనుక కోర్కి - వెన్నాడునొకో? ౧౨౯

కం॥ సౌందర్య వతిని గని మదిఁ
బొందన్ దలఁపూనె నంచు - భువిఁ బలికెదరా
సౌందర్యము తమ మదిలో
ముందఱఁ గోరిక తెఱంగు - పుట్టదె ? నరులన్ ౧౩౦

వ॥ ప్రభువతంసమా ! ఈ విషయమున కొక దృష్టాంతము కలదు. సావధాన చిత్తమ్మున నుత్తలంపడక విన వలతు నెట్లనిన - మున్నొక పట్టణమ్మున - ౧౩౧

ఉ॥ రాకొమరుం డొకండు మది
రాక్షి వివాహమునై సుఖాబ్ధి న
జ్జాఁకలఁ దోఁగుచుండు తఱి
రాచకొమారిత భర్తపై మదిన్
లేకయె లెంక లంకెగొని
లే జవరాలిని రాజు ప్రక్కకున్
వీఁకను దార్ప మత్తుఁగొని
వేడ్క రతి క్రియ లందె రాజొగిన్ ౧౩౨

కం॥ ఒకనాఁడు కైపు దిగు తఱి
సకియం గవ గూడఁ బోయి – జాణతనమ్మొ
రక తెలిసి దాసి నఱచిన
సకలం బది తెలిపె నిజము – సాధ్వస మతియై ౧౩౩

చం॥ అది గమనింపఁ బోయి తన
యాలొక సేవకు ప్రక్కలోఁ బదిం
బదిగ రతి శ్రమం దవిలి
బంధుర సౌఖ్యను, గాఢ నిద్రలో
నొదిగిన దానిఁ బల్లవుని
యూరువులం దల వ్రాల్చి భోగ సం
పదఁ దులకించు దాని కుచ
మర్దన చిహ్నను మ్లానదేహను౯ ౧౩౪

కం॥ రంభా వనాంతరమున౯
రంభోరువు రాజభటుని – రతి విషయ పరీ
రంభణ సుఖ తత్పర సం
రంభ విజృంభణ మనోజ్ఞ – రాజ్ఞి౯ గనియె౯ ౧౩౫

చం॥ కని మనసెల్ల గుల్లవడి
కాఱియ పెట్టి కలంపఁ దెంపు పెం
పున దల పోసెనిట్లు నన
బోణి జగా జిగి మేని నాణెము౯

మనమున నమ్మి వంచితుని
మాడ్కి హతాశుఁడ నైతిఁ దప్పుఁద్రా
గిన జడుఁ డెందు మేల్పడి ల -
గించునె ? యంచితకీర్తి నించునే ? ౧౩౬

ఉ॥ త్రాగి పరాయి దాసి నిజ
దార యటంచు భ్రమించి మించి సం
భోగములం దొడల్ మఱచి
పూర్వ మనీష నడంచి భ్రష్టునై
యీగతి మద్య పాయి యయి
యెల్లఱు నవ్వ స్వమాన మూనమై
యోగయి నాఁడ స్త్రీల మది
నుంచిన కోరిక కారణమ్ముగా ౧౩౭

శా॥ స్త్రీలేమో ? పరిపూర్ణ కామ సుఖ సం
దీప్త ప్రదత్తైక లీ
లా లోల ప్రచుర ప్రభూతలని క
ల్పస్థాయి నానందముల్
బాలింపం గలరంచు నర్థులకు సం
ప్రాప్తించు నంచాసమై
హేలా పాన మద ప్రవృత్తి నిటు మి
థ్యా బుద్ధి యోజించితిన్ ౧౩౮

ఉ॥ చంచలవోలె మానసము
చంచలవోలె మెఱుంగుఁ జూపులున్
జంచలమైన దేహమును
జంచల కుంచిత వాగ్విశేషముల్

సంచిత కర్మ బద్ధ లయ
　　　　సంచయ కామిను లెంత వారలే
సంచిత వృక్ష సంగత శు
　　　　కావళి వోలె బహు ప్రసారితల్　　　　౧౩౯

కం॥ ప్రాణ ప్రియ యని నమ్మిన
నేనే వంచితుఁడ నైతి - నెలఁతలు హేమం
తానిల పృథక్ప్రసారం
బౌనటు నత్యంత చంచ - లాత్మలుః దలఁపన్　　　　౧౪౦

చం॥ అకట! ననుంబలెన్ బృథగ
　　　　నంత విషాద నికార కారణా
త్మికముల కెంద ఱగ్గమయి
　　　　తేకువ వీడి దురంత దుఃఖ జీ
విక గొన యూపిరిఙ గడపి
　　　　వేఁగుచు నుందురు స్త్రీలు వంచనా
వికట నిశాట నాటకము
　　　　వేసి జగమ్ముల ముంతు రెల్లెడఙ　　　　౧౪౧

చం॥ వలపొక గ్రుడ్డి యేమెఱుఁగు
　　　　వాస్తవముఙ దన గొప్ప లాతి వా
రల కొలఁదుల్ గణింపదు స
　　　　రాగ విశేషమొ ? భౌతిక ప్రియా
దులొ ? మఱియేవొ ? వారల మ
　　　　దుల్ వెలవోయి, యధీనమై పథ
స్ఖలనముఁ బొంది దుష్ట
　　　　పథ సంగతి వెంగలు లౌదు రద్దిరా !　　　　౧౪౨

కం॥ అని దూరాలోచనమున
మనమున వైరాగ్య మంది - మాయావధి దా
టిన వాఁడు వోలె, నడచెను
గనుక తలఁపు లందమునకుఁ - గారణము నృపా! ౧౪౩

కం॥ ననుఁజూచి యెమ్మెలాఁడిగ
మనమున దలపోసి పోసి మరులు కొనునటుల్
జనులొక కొందఱు వికృతులఁ
గని కామించెదరు తలఁపుఁ - గల కొలఁదులచే ౧౪౪

చం॥ అతివనుజూడ నెమ్మదిఁ ద
దాకృతినే ప్రతిబింబితమ్మునై
సతముఁదలంచు కొద్ది సుఖ
సంగత వాంఛ జనించు దానితో
వెతలకుఁ గారణంబగు వి -
వేకమతిన్ దలఁగించు లేనిచో
నతిశయ సుందరాకృతి యె -
ట్లైన జనించునె? బుద్ధి లోపలన్ ౧౪౫

గీ॥ మనసుఁ గలిగిన యందమ్ము - పెనఁగులాడు
కోరికలు లేమి యందమే - కోశమందు
లేదు, మననమె సౌందర్య - లిప్స సుమ్ము
అందమే లేదు కోర్కెలేనట్టి యతికి ౧౪౬

గీ॥ ధరణి నెన్నెన్ని విధముల – నరులుఁ గలరు!
ఖిన్న భిన్నా కృతులు వారు – ప్రియము పడరొ !
యొండొరులపైన నీవలె – నొకటి నిజము !
కోరు కోర్కి ప్రధానమై – గొనబుఁ గూర్చు ౧౪౩

కం॥ స్త్రీలుం బురుషులు కోర్కెలఁ
దాలుకొనఁ సొగసుఁ దోఁచి – తంటాల్గుడుపుఁ
మేలిమి సొగ సెదఁ గలదిఁకఁ
జాలించిన కోర్కి యంద – చందము లుడుపుఁ ౧౪౪

మ॥ మల మాంసాస్ర సిరా వసా స్థి తనువూ
ష్మ శ్లేష్మ వాతాది దో
ష లతాశ్లేషము గంధ బంధురము దృ
శ్య భ్రశ్య నశ్య క్రియా
ఫలితమ్ముఁ గల దేహముఁ గుఱిఁచి శ
శ్వత్స్థాయి గా నమ్మి యెం
దులకుఁ గాని వికార చేష్టలకు మం
దుల్ భ్రాంతి నల్లాడరే ! ౧౪౫

మ॥ ఎపుడో ! యెచ్చటనో ! యెటో ? యెఱుఁగనొ
నే ! తప్ప దెప్పట్ల నే,
నపమృత్యు స్థితి దేహధారి పతనం
బందున్ నిజం బిట్టిదా

కపట ద్యోతకా గర్హ్య జీవితము సం
ఖ్యాకమ్ములోకమ్ము మో
హ పరీతమ్మయి కూలుచుంటఁ గని నా
కాశ్చర్యముఁ గల్గెడిన్ ౧౩౧

కం॥ ఎన్నఁడుఁ గని విని యెఱుఁగని
యిన్నిరుపమ తత్త్వబోధ - కెంతయు ముదముఁ
గన్నట్టి మన్నుజేడపు
డన్నిట వైరాగ్య మూని - యఖిలం బెఱిఁగెన్ ౧౩౧

గీ॥ ఆత్మ సంశయములుఁ దన - యాలి వలనఁ
తెలిసికొని 'హేమచూడుఁడుఁ' - దేరుకొనియె,
వానిఁగని తమ్ముడును దండ్రి - జ్ఞానులైరి
రాణిఁ కోడలి వలన వై - రాగ్య మందె ! ౧౩౨

గీ॥ నగరవాసులు రాష్ట్రజ - నమ్ముఁ గూడ
నాత్మ విజ్ఞాన ధనులైరి - యంతిపురము
చిలుకలును దత్త్వవాక్యముల్ - వలుక వినుట
"వామదేవుఁడు" సైతమ - బ్రమ్ము సెందె ! ౧౩౩

గీ॥ విషయముల వీడి నినునీవె - వెదకి కాంచు
మఖిల మాదర్శ బింబిత - మైన వస్తు
లట్లు గనఁబడు నాత్మ క - న్యంబొకండు
లేదదే వెల్గు నన్ని వె - ల్గించుతాను ౧౩౪

కం॥ ఆ నగరమ్మున లేడొకఁ
డేనియు నజ్ఞాని యమ్మ - హీతలమున శో
భానుపమ సత్యలోకము
పోణిమి వెలుఁగొందు నగర - ములఁ 'గాంచి' యటుల్ ౧౫౫

కం॥ "నీవే! పరమాత్మవు" విష
యావళి విడి నిన్ను నీవె! యరయు మఖిలమున్
నీవై వెల్గుదు వెలుఁగుల
తావయి యని పలుకు శుక వి - తతి యా యూరన్ ౧౫౬

కం॥ సజ్జన సహవాసమ్మున
నజ్ఞను లెటు మార్పుఁజెంది - రటు సన్మైత్రిన్
ముజ్జగములు దొరయగునే ?
బుజ్జగవున్ బలుకులేల ? మునికుల తిలకా ! ౧౫౭

కం॥ "భృగురాముఁడు" సత్సంగతి
నగు లాభము విని గురువ - రా ! సతిచే రా
జగు "హేమచూడుఁ" డెటుజ్ఞా
నగరిష్ఠుండాయె, మఱి వి - నన్ మనసాయెన్ ౧౫౮

చం॥ అన విని యత్రి పుత్త్రుఁడు, మ
హా ముదమంది మదీయ వాఙ్మఖ
మ్మును నవధానివై వినుమ!
భూపతి చంచలమున్ త్యజించె నై

నేను నొకసారి యన్నివిడ
నాడ స్వశక్తియుఁ బొంద సాహస
మ్మను మఱిలేమి సిగ్గుపడి
పొల్తుకతోఁ బలుకాడ కుండినన్ ౧౫౯

కం॥ ఉడుగని కోరికలం బడి
నడయాడుచు భార్య మాట - జ్ఞాపక మగుచో
నెడనెడఁ దడపడుచున్ గడు
నొడుదొడుకగు మనుగడన్ ని - యుక్తుండయ్యెన్ ౧౬౦

గీ॥ అన్ని యుండియు మది నుఱి - యాట కతన
ననుభవింపను విరమింప - నయితిఁగాక !
యా స్త్రీఁగోల్పోవు జను నట్టు - లను దినమ్ము
విరతి రహిత భ్రమాటవిఁ - దిరుగుచుండె ! ౧౬౧

చం॥ కనుకని "హేమలేఖ" నిజ
కాంతుఁడు కాముక బాధచే మన
స్సును గలగుండుఁ జేసికొని
స్రుక్కుటఁ గన్గొని నాథ ! పూర్వ రీ
తి నిపుడ లేమికిన్ గతము
తెల్పుఁడనన్ నృపుఁడిట్లు వల్కె నో
వనజ దళేక్షణా ! వినుమ
స్వానుభవైక విశేష సంగతుల్ ౧౬౨

ఉ॥ గుణమణీ! నీవు పల్కినవి
గుర్తున కున్నవి యాచరించుట౯
మును పెవి? మేల్మియౌ నవియె;
ముఖ్యముగా నిపుడంత సౌఖ్యకా
రణముగఁ దోఁప వయ్యవియె,
ప్రాగను భూతిని బట్టి వానివై
పునకె తటాన లాగుఁ గద!
బుద్ధి సదా! యలవాటు పాటున౯ ౧౬౩

కం॥ కాన నెటులయిన బరవి
జ్ఞానద సుఖమబ్బునటుల - నను దయ సేయం
గా నర్థించెద నన్య వి
ధాన౯ మదిఁదలఁప వలదు - తత్త్వానుభవీ! ౧౬౪

కం॥ ఆమాటలు మదినించిన
"హేమాభిధ" తలఁచె నిట్లు - లీరాజు విరా
గామృత పానాభ్యసనమె?
ధీమత్సూచనలు - తేట - తెల్లంబాయె౯ ౧౬౫

గీ॥ భావికాలాన! ద త్త్వ సం - పద్వరిష్ఠుఁ
డీతఁడగు, సూచనలుఁదోఁచె - నేను పలుకు
తత్త్వమును విని వైరాగ్య - తత్పరుఁడయి
జీవితము మార్పుఁజెందె, ని - శ్చయమతిని ౧౬౬

కం॥ శ్రీమత్త్రిపురాదేవీ
భూమారాధన ఫలాప్తి - భూనుత తత్త్వం
బే మనుజుం డెఱుఁగడొ? వాఁ
డీమహి, సత్యానురక్తి - నెనయఁ దలఁతియున్ ౧౬౭

సీ॥ భూపాలతిలక! మ - త్పూర్వ వృత్తాంతమ్ము
వినుతు, వధానివై - వినుము; జనని
నేనాడు కొనుటకై - స్నేహితురాలి నొ
కర్తుకఁ గూర్చె నా - కాంత యసతి
యగు చెలికత్తెతో - ననుగత యగుటఁ ద
ద్గుణ గణమ్ములుఁ దన - కు ననుభూతి
మసలుటన్ జెడియె నా - యసతి కుమారుండు
మోహనుఁడను వాఁడు - మోహ మతిని ౧౬౮

గీ॥ నా యనుంగుఁ జెలిన్ మద - న కదనమున
ననుదినముఁ గూడిమాడి సు - ఖాబ్ధిఁ దేల్చి
కాల మొక లీలఁ గడపెను - గాని నేను
బ్రక్క నుండుటఁ జెఱుపఁగాఁ - బాలువడియె - ౧౬౯

కం॥ అతి నిర్మల నన్నెవ్వరు
వితథ వ్రతగాఁ బొనర్ప-వెరవును లేమిన్
మతి వెఱచి చూచు చుండిరి
మతిహీనుల పనులు బుధ స - మంజసమగునే? ౧౭౦

గీ॥ అసతియై నట్టి చెలికత్తె యన్య యగుట
నాఁడునాఁటికిఁ దగ్గించె - నా హితమ్ము
సహజముగ నేను కౌతుకా - వహను గాన
నామె వీడిన నే వీడ - నైతి నామె  ౧౭౧

కం॥ నానెచ్చెలితోఁ దిరుగుట
చే నాపయి "మోహుఁ"డెడఁదఁ జెడుఁ దలఁపుఁగొనెన్
గానీ! విశుద్ధ చరితను
నే నాతని కగ్గ మగుదు - నే? యెన్నటికిన్  ౧౭౨

గీ॥ ఉగము జగమును బేర్కొనె - నొక్కమారు
మోహనుని హస్తగత యయి - పొరలె ననుచు
నంతియే గాక! స్నేహితు - రాలి నిజ కు
మారు నునిచెను, నా యాజ - మాన్య మందు  ౧౭౩

గీ॥ మోహనుఁడు నాచెలిమికత్తె - మోహబుద్ధి
సాహసమ్మున మతిఁ దప్పి - సంగమించె
నంత నామెకు జనియించె - నస్థిరుండు
పేరునకుఁ దగు గొనము పెం - పొరు ఘనము  ౧౭౪

ఆ।వె॥ కాలమిట్లు జరుగఁ - గా "నస్థిరుండు" పెం
డ్లాడెఁ "జపల" నామె - కైదు మంది
సుతులుఁ గలిగి రతుల - సుందరాకృతులు - తత్
పంచ భూతములకుఁ బ్రతులనంగ  ౧౭౫

ఉ॥ ఒక్కొక పుత్త్రుఁ డొక్కొక, మ
హోన్నత సౌధముఁ గట్టి యందులోఁ
బెక్కు మనోజ్ఞ వస్తువులుఁ
బ్రీణన గాన కళాద్య సాధనల్
మిక్కిలిఁ గూర్చి తండ్రిని, స -
మీహిత భక్తి సపర్య లెంతయో
యెక్కువ మక్కువన్ జలిపి
యీడిత వాంఛలుఁ దీర్చు చుండఁగన్ ౧౭౬

మ॥ చపలా ప్రేరణ ముఖ్యుఁ డస్థిరుఁడు వి
స్తారమ్ము తోరమ్మునన్
విపులమ్ముల్ సుఖ సంపదల్ వెలయఁగా
స్వీయాత్మజుల్ సూచి తా
నపుడప్పందినమాత్రఁ గైకొనుచు జా
యా తోషణుండై యప
త్రప జీవించుచు నుండెఁ గాలమిటు మి
థ్యా బుద్ధిఁ బోఁద్రోయుఁడున్ ౧౭౭

గీ॥ ఛాయవలె వెంటనంటుఁ ద - చ్చపల మగని
నను నిమేషము ననురూప - మును ధరించి
యస్థిరుఁడు దాని కైవస - మయ్యెఁ గామ
మోహితుండయి భార్యా మ - నోహరుండు ౧౭౮

కం॥ ఇది యిటులుండ 'మహాశన'
సుదతీ మణి "యస్థిరాఖ్యుఁ" - జూచిన మదన
ప్రదరాహతి వివశస్థితిఁ
గదిసిన నతఁడేలు కొనియెఁ - గాంతామణిగా ౧౭౯

కం॥ ఇరువురు భార్యలతో న
స్థిరఁ డైహిక విషయ సుఖ మ - తిఁ బొందుచు దు
ర్భర నిర్భర కష్టహతిఁ -
బరిగొనె సంసృతికి నొగ్గి - బగ్గము పాడై ౧౮౦

గీ॥ ఎన్ని వస్తువు లార్జింప - నెంతలేసి
భోగములఁ గూర్చినఁ దృప్తిఁ - బొంద కెప్పు
"డస్థిరుని" వేఁచి తినును "మ - హాశన" యన
నగు మహాశనఁ గామ్య క - ర్మాదులందు ౧౮౧

కం॥ కాలం బీగతి దంపతు
లోలిఁ గడుపంగ వారి - కొదవిరి కవలై
"జ్వాలాముఖ - నిందితు" లని
వాలాయము పిలువఁ దగిన - వారు కుమారుల్ ౧౮౨

గీ॥ సౌఖ్యమంద దురాశ నిచ్చలును హెచ్చి
ముచ్చిరును "నస్థిరుండు" ద - న్మూలమున స
తమ్ము దుఃఖ పరంపరఁ - దవిలి భార్య
కుంది వందురుచుండుఁ దా - డెందమందు ౧౮౩

గీ॥ కామ పరవశుఁ డగుటఁ ద - త్కామినీ ద్వ
యమ్ముతో రతివాంఛ చే - నహరహమ్ము
"నస్థిరుండ" య్యె స్వేచ్ఛలో - నస్థిరుండు
పకుల పలుకులె వేదాంత - సారమనుచు ౧౮౪

గీ॥ అజవంజవ వార్ధి నో - లాడి యాడి
నిరతిశయ వాంఛలఁ దృప్తిఁ - బొరయకునికి
దుఃఖ భాజనమగు జీవి - తోదయమున
"నస్థిరుఁడు" - నస్థిరుఁడుఁ గాక - సుస్థిరుండె? ౧౮౪

గీ॥ చెలికత్తె పొత్తుచే నె
చ్చెలి జీవచ్ఛవము నయ్యె - భిన్న విభిన్న
మ్ములగు మనశ్శక్తులు తుదిఁ
బలపలనై తెల్లవాఱె - బ్రదుకు దినములన్ ౧౮౫

కం॥ తరువాత కొంత కాలము
జరుగ "నవద్వార పురముఁ" జిక్కంగని "య
స్థిరుఁ" డాలు బిడ్డలను గొని
పరువడి కాపురము సేసె - బాహాటముగా ౧౮౬

కం॥ ఇరువురు భార్యలు మఱి యే
గురు కొమరుల పొత్తు వలన - గొంచెంబేనిన్
విరతి నెఱుంగక చిరతర
పరిశ్రమానుభవ లబ్ధ - బాధితుఁ డగుటఁ ౧౮౭

కం॥ నిరత సుఖాశా సాధో
పరి ఖేలన బుద్ధి కొలఁది - బహు కష్టమ్ముల్
దొరలుట "నస్థిరుఁ డొక క్షణ
పరిమితియును సంతసమున - బ్రదుకండు గదా! ౧౮౮

కం॥ ఆ నగర నివాసినియా
నానెచ్చెలి సుతుని వెత ల - నారత మరయం
గా, నిస్పృహమతిఁ గుందెను
నే నేమని చెప్ప వారి - నిరయం బకటా! ౧౬౦

కం॥ నేనుండిన వారుందురు
నేనుండని యెడల వారు - నిలువరు చెలిమిన్
నానెచ్చెలికిని నాకును
మానుగ బెల్లమునఁ దీపి - మాదిరి వెలసెన్ ౧౬౧

ఆ॥వె॥ "అసతి" వలన శూన్య - "మస్థిరు" వలన ని
ల్కడయు లేమి, "చపల" - కతన చపల
తయును "మోహు" వలన - స్తబ్ధత్వము "మహాశ
న" వలన జనియించె - నైచ్య గుణము ౧౬౨

కం॥ నేనవ్వారిని వీడిన
బ్రాణా ల్వోగొట్టుకొనుట - వలనన్ వారిన్
మానక వెన్నిడు కొంటిని
నేనందుల కొగ్గ వలసె - నిందా స్తుతులన్ ౧౬౩

కం॥ తెలివిఁ గలవారు, నా ని
ర్మల చరిత మ్మెఱుఁగు కతన - మన్నింతురు వె
గ్గలముగ జడులెందఱో ? నా
కలితనమును గూర్చి యాడి - కలు గూర్చిరెటో ? ౧౬౪

సీ॥ నా తల్లి నిర్మలి – నమ్మ విశాలమ్మ
నిర్ఘోషమును మహా - నిరుపమాన
మైన ప్రపూర్ణ వి – జ్ఞానమ్మ గగనమ్ము
కన్న విస్తీర్ణమ్ము – ఘనము సర్వ
శక్తిదమును – శూన్య – శక్తి నిరాధార
సకల కలాధార – సౌఖ్యదూర
నిరుపమ సుఖ నిధి – నిర్వ్యాజ కరుణాబ్ధి
రూప విహీన, నిరూఢ రూప ౧౭౪

గీ॥ అస్మదుపమా సుతాదిక, యనుపమాన
సూక్ష్మరూప మహద్రూప – శుభగచరిత
నిరుపమానంద వార్ధి ని – ర్ణిద్ర భద్ర
యామె కామెయె సాటియన్యమ్ము లేదు ౧౭౫

ఉ॥ స్నేహితురాలిపై మమతఁ
జెందిన నైన మదీయ మంత్ర శ
క్త్యూహలు పోహళింపఁ దగు
నుద్ది యనంబడు నేను - తల్లికిన్
సాహసి "యస్థిరుండు" తలి
చాటున బండిన తత్కుమారులు
త్సాహిత నిద్రఁబోదురు "ప్ర
చారుఁడు" నెచ్చెలి రక్ష సేయఁగన్ ౧౭౬

కం॥ ఆ సమయమ్మున నేనును
భాసురమతిఁ దల్లి యొడిని - బండి సుఖింపన్
వేసరక వారు లేచిన
యాసమయము నంద లేచి యానందింతున్ ౧౯౮

గీ॥ "అస్థిరుండుఁ" బ్రచారుండు - ననుఁగుఁ జెలులుఁ
గావునఁ బ్రచారుఁడూరను - గాచియుండు
"నస్థిరుఁడు" లేనివేళ నే - యదనునైనఁ
జెలిమి కది తారకాణయై - శ్రీ వెలుంగ ౧౯౯

గీ॥ దారమూడిన పూసలే - తీరు జాఱు
నట్టులుఁ బ్రచారుఁడును లేమిఁ బట్టణజను
లల్లకల్లోలమున గుఱి - యగుదు రప్డు
మద్ధితమ్ము యథాస్థితి - సిద్ధిఁ బొందు ౨౦౦

ఉ॥ కారణమేమిటో? తెలియఁ
గా దొకపట్టునఁ బట్టణ మ్మడం
గారిన నన్య పట్టణము
గ్రక్కునఁ జేకొను నిట్టు లస్థిరుం
డారయఁ బెక్కుపత్తనము
లం దధినేతగ వెల్గ భూరి సం
స్కారము లందియున్ విడఁడు
సార్వ జనీన దురంత దుఃఖముల్ ౨౦౧

గీ॥ గొప్పవారికి బిడ్డయై యొప్పఁగాని
"చపలయు మహాశన" యు జంట - సతులు నగుట
స్వేచ్ఛ" గోల్పోయి - వారికై - వివశుఁడయ్యెఁ
గాన సుఖమెట్టులబ్బు దుః - ఖమ్ముఁ దప్ప ౨౦౨

గీ॥ పుత్త్ర పంచక మెదిరించెఁ - బోరెఁ "జపల"
యవమతిఁ గలిగించె "మ - హాశన" యిఁకఁ
దక్కు క్రముక్కడులఁ జిక్కెఁ గుక్కవోలె
"నస్థిరుఁడు" ముచ్చముడిఁగె వ్య - త్యస్త గతుల ౨౦౩

కం॥ నానావిధ దుశ్చేష్టల
నానావిధ దుఃఖములను - నానాక్రియలఁ
నానాకృతులఁ బొందుచు
నానాభ్రష్టత్వ మొందె - నా - "యస్థిరుడుఁ" ౨౦౪

గీ॥ దుష్పథానుచరఁ జేరి - దుష్టయయ్యె
ననుఁగుఁ జెలి దానిఁ గూడి నే - నైతిఁ గడకు
గతిమతి నడెట్టి వారిని గట్టి కుడుపుఁ
జెలిమి కలిమిని బలిమిఁ ద - చ్చింతలెల్ల ౨౦౫

కం॥ వూనిక "నస్థిరు" గతిఁ గని
నానెచ్చెలి చింతఁబొందె - జ్ఞానవిహీనల్
తో నెయ్యము కతనను దన
కీ నెగులుఁ దగుల్కొనెఁ వి - హీన క్రియలఁ ౨౦౬

కం॥ బన్నమ్ము లెన్నొ ? తన్నుఁ
దన్నినటుల్ చెన్నుఁదఱుఁగఁ - దా నొంటరియై
యున్న నను జేరుటను మే
ల్మి న్నెలకొని రక్షణమ్ము - మేకొని యలరెఁ  ౨౦౭

కం॥ నానెచ్చెలి తన యనుఁగును
బోనడఁచి కొమాళ్ళ విడిచి మునుమున్న ననుఁ
బ్రీణన మతిఁ జేరి యథా
స్థానమ్మున జననిఁ గలిసి - సరభస వృత్తిఁ  ౨౦౮

శా॥ ఆనందాబ్ధి నిమగ్నయై యలరెఃనా -
థా ! తాముఁ దద్రీతి న
జ్ఞానప్రోద్భల శత్రుసంతతిని ని
ష్ఠాతోగ్ర వైరాగ్య ఖ
డ్గానఁ జంపి స్వమాతృ పీఠి కడ సా
ఖ్యం బందుమా ! యిద్ది స్వే
చ్ఛానందమ్ముల కెల్ల నెల్ల యనుభూ
త్యాధిక్యతఁ బల్కితిఁ  ౨౦౯

కం॥ మదభీష్టమ్మను జగద
భ్యుదయాద్యము భవమహాబ్ధి - నుత్తీర్ణ కళా
విదితార్థము తాత్త్విక సం
విదఖండము స్వానుభవ వి - వేకోదయముఁ  ౨౧౦

కం॥ అతిసులభ మతిని గూఢము
గత యతి లబ్ధానుభూతి కలికల్మష ఘో
రతరాటవీ దవానల
మతులోపనిషద్రహస్య – మద్భుతమున్నృపా ! ౨౧౧

## ఆశ్వాసాంత పద్యము

కం॥ ఇహపర సౌఖ్య నిభేదము
లహంమతి నెఱుంగ లేక - యఖిలముఁ దానం
చహమహమిక మెలఁగు జడ
స్పృహ మడఁపి వెలుంగుఁ జూపు – శ్రీశం డోమున్

## గ ద్య ము.

ఇది శ్రీ వైద్యవిద్వత్పండిత సత్కవి - శ్రీ నారు నాగ నార్య మహాశయ విరచితమగు త్రిపురారహస్యమున ప్రథమకోశము సమాప్తము.

ఓం తత్సత్





# శ్రీ త్రిపురా రహస్యము



## ద్వితీయ కోశము

కం॥ కృతక మగు జగతి నిబిడీ
కృత నిజ తేజోవిభూతిఁ - గేవలము స్వతః
స్థితి నెఱుఁగని కించిత్జ్ఞుల
నతివేల కృపఁ గణించు - నాద్యం డోముఁ

కం॥ ప్రేయసి! నీ పలుకులు విన
ద్వైయర్థమ్మయి నిగూఢ - తత్త్వమయి భవత్
ధీయోగ సులభ సాధ్యము
నై యస్మాదృశుల పాలి - కవభోధమగుఁ                    ౧

గీ॥ అప్సర స్సంజనితవు మ - హర్షి చేతఁ
బెంపఁబడు దాన వన్నిటఁ - బెద్దవగుట
హస్తగత బదరీఫల - మైన తత్త్వ
బోధ నాకెంతో? దుర్గ్రాహ్య - గాధ యయ్యె                    ౨

గీ॥ అదరువు లేని యూహా ప్ర - యత్నములకు
సాధ్యమును గాని గాలిలో సంచలించు
బొమ్మవలెఁ గదలాడు నీ - బోధ సులభ
సాధ్యమా! యని మదిఁ దోఁచె - శంక యొకటి! ౩

కం॥ చూచుటకుఁ జిన్నదానవు
వాచవి పలుకులకుఁ బెద్ద - వయసుఁ గలట్టుల్
తోఁచెడి నీచెలి యెవ్వతె?
యాచెలి కొడుకు లెటు? నిహతు - లైరి తెలుపుమా! ౪

కం॥ నీవాడిన వన్నియు నిజ
మా! వానం గలుగుమేలు - మఱి యెట్టిదియో?
భావైక్యము కుదురదు; క
ట్టా! వంధ్యాపుత్రు కథకు - పాఖ్యానమగున్ ౫

సీ॥ నాటకమందు వం - ధ్యాపుత్త్రుఁడొక్కండు
ముత్తైవుఁజిప్పలోఁ - బుట్టి, వెండి
యాభరణాల్దాల్చి - యుద్ధమ్మునందోఁచు
నరదమ్మునీడపై నధివసించి
యవకాశమను నర - ణ్యానిలోఁ దిరుగుచు
మనుజ శృంగాయుధ - మ్మును ధరించి
రాఁబోవుతఱి నున్న - రాజునని౯ జంపి
గాలికోటలను ము - క్కలుగఁజెఱచి ౬

గీ॥ యెండమావులు నా బావి - నీదులాడి
స్వప్నగత నిర్ఝరులఁగూడి - బంతిబువ్వ
నారగించె నటంచాడు - హాస్యనటుని
పద్ధతిఁ గూడె సంశయా - స్పదము ముదిత ! ౭

చం॥ అనవిని "హేమలేఖ" ప్రియు
నట్టె కనుంగొని, మత్ప్రబోధ సూ
క్తిని నిజముండదంచుఁ దరి
తీపున బల్కెదసత్యముఁ దప
స్సును నడపంగఁజాలు ముని
సూనులతోఁ జరియించు మద్వచ
స్సున నన్నృతమ్ముఁ గల్గునను
చుఁ బలుకఁ సరియౌనె ? భూవిభూ ! ౮

గీ॥ సంశయగ్రస్తు లడుగు ప్ర - శ్నలకు బదులు
చెప్పకయ తప్పుదారిఁ జే - ర్చిన ఖలులకు
నుభయలోక సుఖమ్ములు - నుండునొక్కొ !
కాన; నామాట నమ్మమో - ప్రాణనాథ ! ౯

కం॥ ఏరోగి యైన మందుల
పేరును విన నిజరుజాళి - వీడునె ? తోడ్తో
కారణ మారయు వైద్యుని
జేరి తగినమందుఁ గొంత - సేవింపనిచో ౧౦

కం॥ నామాట వినిన తదుపరి
యేమాత్రము సౌఖ్యమీయ – దీజీవితమం
చామువిడి పలుకవే ! యిట
మీమది సందియ మొకింత – మెలఁగుటఁ దగవే! ౧౧

అ। వె॥ మంచి పలుకువాని – మదినమ్మకుండుట
సాధ్యశత్రు గెలువఁ – జాలనట్టు
లింక నమ్మియుండు – టెనయగుఁ బ్రేమాను
భూతిఁ బెంచునట్టి – మాతృసమము ౧౨

ఆ। వె॥ నమ్మకమ్మె జగతి – నరుల కాధారమ్ము
నదియ లేమి నునికి – యసలె లేదు
కార్యకారణములె; కల్గించు పనులని
యెమ్మెలేల! దాని నమ్మవలదె ! ౧౩

కం॥ మానవుఁడూపిరి విడచుట
లో, నమ్మకమున్న మఱల లోఁగొనగ నగు న
ద్దానిని మానిన వాఁడును
బ్రాణాధారమ్ము లేని – పశువట్లు సెడుఞ్ ౧౪

చం॥ అనవిని “ హేమచూడుఁడు, – ప్రి
యా! భవదుక్తి నిజమ్ము! దుష్పథ
మ్మున జనువాని నమ్మునెడ
మున్నెఱి నమ్మిక గాలముఞ్ దవు ౧౫

లొ్కని చెడు మత్స్యముం బలెను
గోల్పఁడుగాదె! నిజాసువుల్ నరుల్
కనుక మొగమ్ముసూచి హిత -
కారి యటంచన నమ్మజెల్లువే? ౧౬

సీ॥ మంచిచెడ్డల నిర్ధ - రించు మార్గంబేది?
మహిత హితోక్తి ప్ర - మాణమనిన
నమ్మహితాత్ముపై - నమ్ముట యుచితమౌ
నమ్మకుండుటయె; ప్రా - ణాత్యయమ్ము
నమ్మియుఁ జెడినవాఁ - డిమ్మహిలో లేడు
నమ్మక యుండుటె - న్నటికిఁ జెడుగు
భువనమే యాధార - భూతమౌ విశ్వాస
మందునమ్మిక లేమిఁ - గుందుఁబొందు ౧౭

గీ॥ వేదములనైన నమ్మమి - బాదగాదె!
తర్కవాదమ్ములకు నిందుఁ - దావులేదు
పర్యవసితము జగము వి-శ్వాసమందుఁ
గాన! నామాట నమ్ముమా! జ్ఞానమూని ౧౮

గీ॥ తర్కకర్కశ హృదయుఁడు దానమూని
బొత్తిగ విచారణము సేయఁ - బోనివాఁడు
నుభయ లోకాల కిర్వురు - నొదుగఁబోరు
వీరలేనాఁడు సుఖపథిఁ - జేరలేరు ౧౯

సీ॥ నృపవర్య! వినుమ వ-చింతు (గొండొకగాథ
సహ్యపర్వత నిజా-శ్రమము నందుఁ
"గౌశిక"ముని కలం-డాశయసిద్ధుండు
వానిచెంగట శిష్య-వరులుఁ బెక్కు
రొకనాఁడు గురువు లే-కున్న జగత్‌స్థిర
తనుగూర్చి చర్చించు కొనెడివేళఁ
దార్కికుఁ డొకఁ డటఁ-దారి మిథ్యావాద
చాతురి నోడింపఁ-జాలి వస్తు  ౧౭

గీ॥ వెలుఁగనగు నిజదృష్టి నం-చెలుకపలుప
దానినొక్కఁడు ఖండించెఁ-దప్పటంచు
విషయవిస్ఫురణమువేఱు విషయవిస్ఫు
రణమె యాధారమగుటఁ ద-ర్కము-పునాది  ౧౮

ఉ॥ కాన నొకండొకండు నిజ
కారణ మూలముఁ గానరామి నెం
తేని నిజమ్మెఱుంగ నది
యెట్లగు? వస్తువుఁ జూచువాఁడుఁ జూ
పేః నిదమిత్థమంచు వచి
యింపఁగ నెట్లగు-వీలు, ? శూన్యమే
యౌను దుదిన్ నిజమ్మనిన
నందఱు సమ్మతిఁ జెంది రావలెన్  ౧౯

మ॥ గురురాకఁ గమనించి కొందఱిది వా
కోవాక్యమై పల్క వే
గిరమే సంశయముల్ విదిర్చి నిజముఁ
గీల్కొల్ప నష్టంతెఱిం
గిరి సౌఖ్యావధి వెల్గి రట్లు నృపతీ!
కీడ్పాటగుఁ దార్కికా
దర మన్నఁ జెలిమాట నమ్మి విభుఁడం
తర్వాణి బోధించుఁడుఁ ౨౦

మ॥ తరుణీ! యింత వివేక మున్నదని స్వాం
తంబందు భావింప న
ద్దిర! ధన్యాత్మవునీవు – త్వజ్జనియె బం
దీభూత సంసార సా
గర నౌకోపమ యయ్యె నిఁ గలిసి ప్ర
ఖ్యాత స్థితిం బొందితిఁ
సరిగా నేది గ్రహింతు – నేది విడుతుఁ
సంస్కారివై పల్కవే! ౨౧

ఆ॥వె॥ విడువఁ దగినదేదొ! విడువంగ రానిదే
దో! యెఱుంగ గురుల యుక్తివాద
ములు మహాబ్ధి మగ్న – ములు దిక్కుఁదోఁపదిఁ
కేమిసేయువాఁడ, నేది? జాడ! ౨౨

ఆ॥వె॥ ఆగమముల వలన – "నస్తినాస్తీతి సం
శయము" లొదవఁ బరుని – సంజ్ఞ లెఱుఁగ
నెట్లు వీలుఁగలుగు – నీదారిఁ జూపించు
మతివ ! నమ్మినాఁడ నాత్మతోడు !    ౨౩

మ॥ ఇటుఁ బ్రశ్నించిన భర్తఁ గన్గొని కృపా
దృష్టిన్ దరిన్ జేరి యి
ప్పటికిన్ దారికి వచ్చెనాఁ దలఁచి యో
ప్రాణప్రియా ! శ్రద్ధమై
పటు నిశ్చంచల బుద్ధితో వినుమ ! యె
వ్వాఁడైనఁ దర్కాశయ
స్ఫుట వాదమ్ముఁ ద్యజించివిన్న నతఃడే !
శుద్ధుండు బుద్ధుండగున్    ౨౪

గీ॥ చంచల మనస్సు మర్కట – సమము దాన
సకల కష్టాళి జనులకు – సంభవించుఁ
జిత్త ముడిగిన నానంద – శేవధియగుఁ
గాన ! శ్రద్ధను వినుమ ! విజ్ఞాని వగుమ !    ౨౫

కం॥ మనసనెడి క్రోతి సురఁద్రా
విన పిదపన్ ముల్లుఁ ద్రొక్కి – పెనుభూతము ప
ట్టినమీఁదఁ జిందుఁద్రొక్కిన
యనువున నెటులుండుఁ దెలియు–మా ! భూమీశా !    ౨

గీ॥ ప్రాజ్ఞులు విచార మంది వి - శ్వాసమూని
సౌఖ్యమును గందు రదిలేని - జడులు, సంశ
యాంధ తమసమ్మునం బడి - యర్థమెఱుఁగఁ
జాలక కృశింతు రెడఁద గ - గ్గోలు సెంది ౨౭

గీ॥ పట్టుదల చేత రైతులు - పంటఁ గంద్రు
వర్తకులు లాభముం గంద్రు - ప్రభువు లధిక
రాజ్యసిద్ధిని గందురు - పూజ్యబుద్ధిఁ
బట్టుదలఁ బూని చేయఁగా - నట్టిదేది ? ౨౮

గీ॥ అమరు లమృతముఁ ద్రావిరి - యమరలోక
మందిరి - తపోవిభూతి నిం - కెందఱెంద
ఱాత్మవాంఛలు మునుముట్ట - నందలేదు ?
పట్టుదల కారణమ్ము శు - భప్రదమ్ము ! ౨౯

గీ॥ ఏది ? పొందిన తరువాత - యించుకేని
నాశమను నది లేదొ ? యా - నంద మదియె,
దాన దుఃఖమ్ము లేశమ్ముఁ గానఁబోము
గాన దాని నెఱుంగుమా ! - కష్టమైన ౩౦

కం॥ భువనమునం గనఁబడు వ
స్తువు లన్నియు బహుళ బాధ - తో, క్షణికమ్మై
ప్రవినాశమందుఁ గావున
సువిచారణ మతిని నిజము - సూక్ష్మ మెఱుఁగుమా ౩౧

గీ॥ బంధమెయ్యది ! యయ్యది – బాధఁ గూర్చు
బాధ లవు వస్తులగు క్షణ – భంగురములు
ధరను క్షణభంగురములు ని – త్యమ్ములగునె ?
నిత్యములుఁ గాని వెటు ? సుఖ – నియతిఁ గూర్చు ! 3౨

గీ॥ సర్వ శక్తిడ్యుఁడగు మహే – శ్వరుని శరణు
సొచ్చినన్ వాఁడుఁ గాపాడు – హెచ్చుకృపను
వానిదయ నెవ్వఁడార్జించుఁ – త్వరగ బంధ
ముక్తియయి కవగూడును – ముక్తికాంత 33

గీ॥ ఈయనంత జగత్తున – కే యనంత
శక్తి యుతుఁడగు ప్రభువవ – శ్యమ్ము సుమ్ము
అతఁడొకండె ! సమర్థుఁడౌ – యాశ్రితాళిఁ
బ్రోవఁ గావున శరణమ్ముఁ – బొందుమతని 3౪

శా॥ దేవుం డాశ్రితపక్షపాతి యతఁడా
దేశించు భక్తుల్ మఱే
వేవో ? కోర్కులుఁ గోర వానిసపుడే
యీడేర్చు నిష్కామతన్
భావారాధనముం బొనర్చు తఱి నా
పద్బాంధవుంబోలి భ
క్తావశ్యమ్ములఁ దీర్చి దిద్దుఁదనపై
నాభారముల్ మోయుచున్ 3౫

కం॥ భగవచ్ఛాసనమై పొ
ల్పగుఁ బ్రారబ్ధమ్ము - భగవ - దనభిముఖుల వేఁ
పఁ గడంగుటఁగని భక్తుల
కగచాట్లం బాపి ప్రోచు - ననుకూలమ్మై 36

గీ॥ భక్తుని మృకండు తనయు నే - పగిదిఁ గాచె
నరరె! ప్రారబ్ధకర్మ పో - నడఁచి కూడ
నందఱెఁగినదే కదా! యతులు నభవుఁ
బూజలొనరించి ప్రారబ్ధ - మును జయింత్రు 37

కం॥ భృగురామా! యీమాదిరి
మగనాలి, హితోక్తి విని ప్ర - మాతృ మనీషన్
మగువ దరిఁజేరి ప్రియుఁడీ
వగ సంభాషించె హృదయ - పరివర్తనతో 38

చం॥ "అణువ" ని "కర్మ" నాఁ "ప్రకృతి"
యంచు "శివుం" డని "విష్ణు" వంచు నొ
య్యన "రవి" యంచు "సోముఁ" డని
"యర్హత" యంచును "బ్రహ్మ" యంచు స
జ్జనులొక కొందఱాడుదురు
సర్వ నియామక శక్తిఁగూర్చి యో
మునితనయా! నిజమ్మెదియొ?
మున్ దలపోసి యెఱుంగఁ బల్కవే! 39

కం॥ నీ వాఁడుదాన వైనను
నీ వాఁడని నమ్మ నాకు – నిజముఁ బలుకవే!
పూ వాడ మిఁ దావులు దెస
లావృతమగు ప్రజ్ఞ యిట్టు – లలముట కతనన్ ౯౦

గీ॥ కాంతుఁడిటువల్కి హేమలే – ఖా లతాంగి
వల్లభుని జూచి ప్రియమారఁ – బలికెనిట్లు
తాము సెలవిచ్చినట్టు లా – త్మానుభూతి
లేమి మెయి నిచ్చ వచ్చిన – లీలనెంత ౯౧

చం॥ భవుఁడును గేశవుండు మఱి
బ్రహ్మ రవీందు లనేకులిట్లు సం
భవములఁ బెక్కురీతులఁ బ్ర
పంచమునన్ విలసిల్లి రట్టివార్
భువన లయాదిసృష్టి పరి
పోషణకర్తలుఁ గాని వీరలా
ప్రవిమల సంవిదత్త్వరుచి
పాటవ మందు కొనంగ నేర్తురే? ౯౨

గీ॥ ప్రియవయస్య! దయామతి – వినుమ, మామ
కీన విజ్ఞప్తి, యీజగ – త్సృష్టి కొఱకుఁ
దొలుత నేపనిముట్టు లే – దలఁతి స్థూల
తనువులేదు స్వతస్సృష్టి – సంభ వంబు ౯౩

గీ॥ వస్తువొకఁడుండి రూపమే - ర్పడి తదుపరి
సృష్టి యొనరుచువాఁడు హ - రించువాఁడె
మూఁడుకాలాలకును మీరి - మొదలుఁ దుదియు
లేక సతముండు నిర్వికా - రైక మగుచు ౪౪

కం॥ ఎవఁడే యాకృతి నెమ్మదిఁ
దివిరి భజించునొ? తదాకృ - తిని బ్రత్యక్షం
బవు భగవంతుం డిచ్చా
వ్యవహృతి ఫలమిడు స్వకీయ - వాంఛానుగతిన్ ౪౫

గీ॥ జగముఁ గనఁబడు నాత్మ యె - చ్చటను గాన
రాదనెదవేని! బ్రత్యుత్త - రమ్ము నిదియె,
యద్దమున దోఁచు నగరమ్ము - నట్టులాత్మఁ
బ్రతిఫలిత జగమెఱుఁగ ర - జ్ఞతను జూడులు ౪౬

కం॥ శివ కేశవ రూపాదులు
వివిధమ్ములై, యేక విభువు - విశ్వావనమున్
దవిలి పొనరించు నతఁడొకఁ
డవితథగతిఁ దోఁచు నేక - మాత్మాకృతియై ౪౭

కం॥ కాన, నిరాకారుని రా
జా! నెమ్మది వెదకు మదియె - సరిపడనియెడన్
మానసమున గను రూపమె,
మానుగ ధ్యానింప నదియె - మానించునినున్ ౪౮

కం॥ ప్రియరాలి మాట మేరకు
రయమున గురునొద్ద మంత-రం బభ్యాసముల్
ప్రియమలరంజేసి దేవీ
దయకుం బాత్రుండయి కొంత - తఱిఁ గడచునెడన్ ౪౯

గీ॥ త్రిపుర కరుణా ప్రసాద ల-బ్ధిని మనమ్ము
సుప్రసన్నమ్ము నై శాంతి చొరవఁగలిగెఁ
గాని సంశయములుఁ గొన్నికలఁచు కతన
"హేమచూడుఁడు' దరిఁజేరె "హేమలేఖ" ౫౦

ఉ॥ దూరము నుండి వచ్చు ప్రియుఁ
దొందర డెందమునం దలంచి వి
స్ఫార నయమ్ము బ్రమ్మఁ నతి
భక్తి సమంచిత గౌరవమ్ములన్
సారెకుఁ జేయ డగ్గఱిలి
సాధుగతిన్ బరిరంభణక్రియో
దార రహఃకలాప బహు
ధా మృదుకౌశల సాంత్వనోక్తులన్ ౫౧

ఉ॥ ఎన్ని దినమ్ములాయె, నృప
తీ ! తమరిచ్చటి కిచ్చవచ్చి రా
కున్న మహేరినిం గనుదు ?
నూరక కాయలుఁగాచెఁ గన్ను లీ

యున్న తెఱంగుఁ దోఁపదు ని
యోగము యోగము గాగ మారె, రా
వన్న తలంపుఁ బెంపెసఁగె -
నాత్మ నొకిలిత నెఱుంగఁ బల్కుమా! ౩౨

మ॥ కలనైనన్ ననుఁజూడకున్న మదిఁ జి
క్కంబట్టి లేనట్టి ప్రో
ద్బల కామాతుర బుద్ధి నేఁడిటుల మా
ర్పాటందుచో ? డెందమం
దలి బేలింపు తలంపు గుంపు నెటు ప్రమం
దం జేసినావన్న యు
జ్జ్వల భావం బొకఁడేర్పడెన్ గగన శం
పావల్లరీ తుల్యమై ౩౩

కం॥ అనిశము వాత్స్యాయన సూ
త్ర నిబద్ధ రతిప్రసిద్ధ - తత్పర సిద్ధిన్
మనసు ముదంబుధి మునుకలుఁ
గను నీమార్పున కదేమి ? కారణము నృపా! ౩౪

ఉ॥ భౌతిక వాసనాపర వి
పర్యయ కార్య కళా కలాప వి
ఖ్యాత విలీన మానసులు
కారణమేమొ ? విరాగులై యథ
శ్చేతనులై మహోన్నత వి
శిష్ట పథానుగతిన్ జరింప నా
చేతము జిల్లుమంచు విల
సిల్లెను వెన్నెలఁ ద్రావునట్టులై ౩౫

కం॥ దైహిక భోగానుభవం
బాహామాత్ర ప్రసారి-తోత్సాహము నేఁ
డైహిక భోగ నిరోధక
సాహస నిష్కామ చర్య సంబర మిడదే! ౫౬

కం॥ ఆ "హేమలేఖ" యిట్లు
త్సాహమతిన్ బల్కునెడ ను-దాసీనుండై
యా "హేమచూడ" భూపతి
దోహల మోహమ్ము విడి బ-దులు వల్కెనిటుల్ ౫౭

గీ॥ నిండు కౌఁగిటఁబొదవిన నృపవరుండుఁ
గొంచె మేనియుఁ జంచల-గుణములేక
స్థితమనీషను బ్రియురాలి మతిఁ దలంచి
తొణఁకని యెడంద నిట్లు బ్ర-త్యుత్తరమిడె ౫౮

చం॥ ఒకరికిఁ జెప్పనేర్చిన మ
హోన్నత నీతి నిధాన మీవె నేఁ
టికిబుల రాగ భోగ విక
టీకృత బుద్ధి జరింపమేలె? మున్
సుకమని దేని నమ్మితినొ?
చూడఁగ నయ్యదె! దుఃఖ మూలమై
ప్రకటిత మౌటఁ దద్విషయ
బాహ్యత నుంటి నిషిద్ధ బుద్ధినై :

మ॥ పరతత్త్వార్థ విలాస భాసురమతీ !
బాగాయె! నీచేత లీ
పరిరంభోపరమ స్వభావ గుణ సం
పర్కమ్మునం దైహికాం
తరముం గూర్చి ప్రమాదగర్త పతనా
నర్థమ్ముఁ గల్పించి దు
ర్భర సంసార విషాద వేదనల ద్రో
పాడంగ నేన్యాయమో ? ౭౦

శా॥ ఆకర్షింపఁ దలంచి నన్నుఁ బరిరం
భానీత సౌఖ్యమ్ములన్
గైకోలిచ్చితి వంచు నెంచ సుఖదుః
ఖత్యాగివౌ నీకు నా
యీ కాలుష్యము లంటునే భ్రమము లే
న్నే ? సౌఖ్య వాంఛార్థ మ
త్త్రాఁక్షన్ రాఁదలఁపన్ రవంత మదిన
ల్లాడించె సందేహముల్ ౭౧

గీ॥ సందియపు ముండ్లుఁ గొన్ని మత్స్వాంత పద్మ
దళములను గ్రుచ్చుకొని బాధఁ గలుగఁ జేసె
నూడఁబెఱికి సుఖమ్మొడఁ - గూడఁ జేయు
మిదియె; యిప్పటి కోర్కివే - తెద్ది, లేదు ౭౨

ఉ॥ ఈ వొకనాఁడు చెప్పితివి
యీ కథ నాకథ యంచు నష్ట ద

ద్భావము నాకగోచర వి
ధంబయి డెందము నందణంగె మి
థ్యా విషయమ్మునై యది య
థార్థ మెఱుంగఁ దలంచి మించు నా
భావము పొంగువాఱె మగు
వా! తగవా! యిఁక వాకొనంగదే! ౬౩

చం॥ అనవిని "హేమరేఖ" విభు
నల్లన మెల్లనఁ జూచి మద్విభుం
డనుపమ భక్తిఁ దత్త్రిపుర
నర్చనచేసి తదీయవిస్తు లో
న్మని కృప కగ్గమయ్యెఁ దరు
ణమ్మున సత్ఫలమందె నిద్ది ప్రా
గ్జని సుకృతం బదృష్టమున
జ్ఞాన నిధానము నయ్యె! మాయురే! ౬౪

చం॥ అని తలపోసి భక్తి మెయి
నాత్మవిభుణ్ భజియించి ప్రాక్చరి
త్రను మునుముట్టఁ బల్కె నిటు
రాజ! పరాకును మాని నిశ్చల
మ్మున వినుమింక నాత్మకథఁ
బూర్ణముగా వివరింతుఁ దల్లియం
చనఁ "బరమాత్మ" యింకఁ చెలి
యన్నను "బుద్ధి" యటందు రామెకుణ్ ౬౫

మ॥ అనుఁగుఁ జెచ్చెలి యా " యవిద్య " సుతుఁడా
హా! ' మోహుఁ ' డై పొల్చు, భ్రాం
తిని గల్పించుచుఁ దత్కుమారుఁడగు నెం
తే! " స్వాంత " మా భార్య - " క
ల్పన " వారిద్దఱి సంతు - " యింద్రియము " ల
వ్వారిండ్లు " పంచేంద్రియా "
లను నొప్పన్ హరియించు వస్తువులె " యా
హల్ " స్వప్న ఘాతార్థముల్ ౬౬

ఉ॥ కోరికయే " మహాశన " యుఁ
' గోపము - తృష్ణ ' తదీయ పుత్త్రి లీ
కారణకాయ ' మూరు ' మఱి
జ్ఞానమె, " మాంత్రికశక్తి " ప్రాణమౌ
నారయఁ దన్మనోహితుఁడు
నైన " ప్రచారుఁడు " దుర్గమాటవుల్
నారక మేను - బుద్ధి పరి
ణామతఁ జేర " సమాధి " యౌ నికన్ ౬౭

ఉ॥ సారత నేను మజ్జనని
సమ్ముఖమందుటయే " విముక్తి " యౌ
ధారుణి వల్లభా! యిదియు
ధ్యానమునన్ గమనింపు మస్మదు
క్త్యారభటిన్ గ్రహించి వెర
వారయ ముక్తిపథానుసారివై
వేఱొకఁడింతకున్ మిగిలి
వెల్గునె? సార పరార్థ సంగతుల్ ౬౮

వ౦॥ అంత నాధరారమణుండుఁ గొంత యోజించి - ౮౯

చ౦॥ పరవశుఁడై సగద్గదిక
భార్యను గాంచి వచించె నిట్టులో
పరమ పదస్థితా ! విను మ
పారమనీష వెలుంగు నీవు సు
స్థిరతర ధన్యజీవివి ప -
దింబదిగా భపదీయ వాగలం
కరణమె సాధు బోధిత వి
కస్వర జీవిత హేసుపుష్పముల్ ౨౦

క౦॥ తానెంత సుప్రసిద్ధుం
డైనను వీలగునె ? నుదుటి - యందుఁ దిలకముఁ
బూని రచింపఁగ నద్దం
బైనను సులభమ్ము గురువె ! యట్టిఁడు సుమ్మీ ! ౨౧

క౦॥ నీకథలో మంతనము ల
నేకముఁ గలవని యెఱుంగ - నీ దయచేతఁ
సాకల్య మెఱ్ఱఁగితిని గా
నీ ! కించిత్సంశయమ్ము - లెడ నుడుగవయో ! ౨౨

గీ॥ తల్లి దండ్రులు లేని నీ - తల్లి యెవతె ?
నేనెవండను ? బరమార్థ - నియతి యెద్ది ?
పొందుటెటు ? దానిఁ దెలియనౌ - పూన్కి యెట్టు
లన్నియును, వివరింపు మం - చడిగి నంత ౨౩

గీ॥ కనకరపు జాలు వట్టోడఁ - గలుగు నెడఁద
నల్లనఁ దలంచి రాజుతో – ననియె " హేమ "
వెలఁది చిఱునవ్వు వెన్నెలల్ – వెలికి దొలఁక
విభుని, గూఢ రహస్యముల్ – విదిత మగుట ౨౪

కం॥ నీ వడిగిన ప్రశ్నమ్ములు –
భావాతీతములు – నిగమ – వర గుహ్యమ్ముల్
శ్రీవాచంయమి సేవా
హేవాక సుబోధితమ్ములే ! భూమీశా ౨౫

ఉ॥ ఐనఁ దదర్థ మేనెఱిఁగి
నంత నిజానుభవైక వేద్యమౌ
దానిని సానుభూతి పర
తఁ వచియింతుఁ బరాకు మాని యి
చ్చో ! నిలఁబెట్టి నీమనసు
సూడిదఁ బెట్టి పరాచితీ పద
శ్రీ నలినమ్ములందు భవ –
సింధుర సింహమ ! యాలకింపుమా ! ౨౬

కం॥ ధరణి దశేంద్రియములతో
నరయఁగ వీల్గాని తత్త్వ– మాత్మ పరముగా
నెఱిఁగినచో ? మత్కథ – మ
త్పర జననీ కథ నెఱుంగ – వచ్చు సులువుగా ౨౭

కం॥ ఇది యిట్టిదనుచుఁ బలుకఁగ
గుదురదు గద! శివునకైన గురు తర బుద్ధిన్
విదితమగు దన్నుదానై
వెదకిన దెలిసికొన నగును – విజ్ఞాననిధీ! ౭౮

కం॥ నేనిట్లని యాతత్త్వము
మానుగఁ జూపింపఁ జెప్ప – మఱి యూహింపన్
గా నయితిఁ గామి నీవే
స్వానుభవ ప్రజ్ఞఁ దెలియ – వలె సొంతముగా ౭౯

తం॥ పురుగు మొదల్కొని పురహరు
వఱకున్ నీవగుదు వింక – వస్త్వాకృతిలోఁ
బఱఁగు మనస్పడఁగ మొయిల్
తెఱ విడు రవి వోలె నాత్మ – తెఱఁగున్ వెలుఁగున్ ౮౦

గీ॥ ఆత్మ వెల్గు స్వయంజ్యోతి – యై సమస్త
వస్తువులు దానిచే వెల్గు – స్వచ్ఛ హృదయ
మందు వెలుఁగించు నాదర్శ – మందుఁ దోఁచు
భాస్కర మయూఖములు వోలెఁ – బ్రస్ఫుటముగ ౮౧

గీ॥ అట్టి యాత్మను జూపింపు – మని యడుగుట
తన కనులుఁ జూడ వలెనని – తలఁచు టగును
వేఱొకని చేత నయ్యవి – విశదమగును
గాన! నట్టిది – గురుబోధ – గా నెసంగు ౮.

కం॥ ఇది "నాది" యని వచింపక
యిది "నేన" నియెఱుక పఱచు - నెది! - నావియనం
బొదలు సమస్తము కంటెను
నెది ? వైలక్షణ్య మయ్యె - దే! "యాత్మ" యగున్ ౭౩

కం॥ 'నావి' యను వాని వదలుమ
'నీ' వవి కావుగద ! నేను! - నీయాలయినన్
'నీ' వేను - కాను గద ! యా
'నావి' యనం దగినవాని - నయమున విడుమా! ౭౪

ఉ॥ అనవిని "హేమచూడుఁడు" ర
యమ్మున నచ్చొట వీడి "నందన -
మ్ము" న కెనయా పురోపవన
మున్ దరిఁజేరి ప్రసన్న భావ నం
దనమగు సుందర ప్రకృతి
తన్మయమ్ముం బొనరించు శిల్పమున్
గనుచుఁ దదంతరస్థ నవ
కల్పిత సౌధ నివాస భాసియై ౭౫

కం॥ నేనిందు నుందు నెవ్వరి
రానీయకు మంచు జాగ-రకు డాజ్ఞయిడెన్
బూనిక భటునకు - రాజట
ధ్యానానుష్ఠాన విధుల - కలవడి యుండెన్ ౭౬

కం॥ నిరత విచారణ మాత్మన్
దిరముగ నెలకొల్పి మివులఁ - తీవ్రతరముగాఁ
బరిశోధించి చిరంతన
పరతత్త్వముఁ గోరి యాత్మఁబరి శోధించెన్ ౧౭

సీ॥ ధన ధాన్య రాజ్యముల్ - దార పుత్త్రాదులుఁ
బశువులు మత్స్వభా - వములుఁ గావు
నాకొఱ కేర్పడు - నీకామితార్థము
లన్నియు భిన్నమే -నగుట దెట్లు?
కుల మత వర్ణ సం - కుల భేద భావముల్
గలిగిన నాకు నేఁ - గాను సత్య
మీ శరీరము నందు - నెమ్ములు మాంసమ్ముఁ
జెడిపోవు నిజము నేఁ - జెడను సుంత ౧౮

గీ॥ పంచభూతము లొక్కెడ - వదలు నన్నుఁ
గాన నేఁగాను బుద్ధ్యహం - కారములును
నేనుఁ గానింక స్వప్రకా - శాన నునికి
యైన "యాత్మ" యె, నేనంచు - నవగతమయి ౧౯

కం॥ గొనకొని సువిచారణమున
ననుదినమును నిష్ఠ చేయు-నవసరమున-దోఁ
చెను "జీఁకటి" యది 'యాత్మ' యె
యవి మఱి మఱి ధ్యాన నుగ్నుఁ -డై యున్నయెడన్ ౨౦

కం॥ పదపడి క్షణ పరిమితిలో
మొదలును దుది లేని వెలుఁగుఁ బొడకట్టిన న
య్యది ? యేమని తలపోయుచు
మదిలో ధ్యానింపసాగె - మఱి మఱి యట్టుల్ ౯౧

చం॥ తదుపరి నిట్టు లొక్క మొగి
ధ్యాన సమీహితుఁడైన నంతలో
నిదుర యెసంగెఁ గాలముఁ - గ
నీసము గొంత వ్యయమ్మునయ్యె న
య్యదనున స్వప్నమొట బహు
ళాతి విచిత్ర మనోజ్ఞ దృశ్యముల్
పొదలుటచేత నిట్టుఁ దల
పోసె నివన్ని మనో వికారముల్ ౯౨

వ॥ అని యుడివోని విడువని పూనిక మెయిఁ బ్రయత్నించి-౯౩

చం॥ మఱియొకసారి నెమ్మది సు
మాళమునన్ గుఱి మీర నిల్పి నే
నరయుదుఁగాక ! యంచు దృఢ
యత్నమునన్ మదినిల్పి చూచినన్
దొరవిడి యామమాత్రమున
దోఁచె నిరంత నిరంతర ప్రభా
విరళ నిరుక్తమౌ తఱపి
వెన్నెలఁ బోలిన హాయి - నెమ్మదిన్ ౯౪

మ॥ వెనువెంటఁ జలియింప మేలుకొని య
ష్టే! తద్విశేషమ్ము లె
ల్లను నామూల శిఖా విచారణము వ
ల్లఁ జీకటిఁ - వెల్గు - ని
ద్రను - స్వప్నమ్మును - హాయిఁ దోఁచు మఱలఁ
దార్మారునౌ దాని కా
రణ మూహింపఁగఁ జాల మత్ప్రియసతిఁ
బ్రశ్నింతు సర్వాంశముల్ ౬౩

వ॥ ఇట్టి క్లిష్ట సమస్యలా "హేమరేఖ" యైనచో
స్వానుభవ విషయము లాసవమాసునట్లు! దెలియం జెప్పం
గలదని తత్క్షణమ పిలిపింపం దలపోసిన యవసరమ్మున- ౬౪

మ॥ ఇటకుఁ రమ్మని "హేమరేఖఁ" బిలుమీ
యెన్నో? రహస్యోక్తులా
డుటకై "రాజు" వచించె నంచు నొకబం-
టుఁ బంపినఁ వాఁడుఁ బ
ల్కుటయే తొందర రాణివాసమును గ
న్గోఁజాలి యమ్మా! హుటా
హుటి, రమ్మా! నృపు నాజ్ఞ యన్న సరియం
చూహించె మేలెంచుచుఁ ౬౫

మ॥ ఇపుడే! పోయె; నిటేల నఁబిలువఁగా
నేహేతువై యుండునో?
నృపు చిత్తమ్మిటు తత్తరిల్లె నది మా
న్పింపఁ బ్రయత్నించి తీ

రుపుఁ జేయఁగ దలపోసి తోడ నొకప -
ర్వ్యందీసి చూచెఁ జనా
ధిప వర్యుఁడు నవ హేమ కూట శిఖరీ -
దీవ్యత్ప్రభా సన్నిభుఁ ౯౭

చం॥ కని నును సిగ్గు దొంతరలుఁ
గాంతునిపై విరఁబోసి లేఁతన
వ్వున వచియించె నీపగిది
భూపతి ! సత్వర మేగుదెమ్మటం
చని పిలిపింప హేతువు మ
దాత్మ నెఱుంగ వచింపుమన్న న
జ్జనవిభుఁ డిట్లువల్కె సర
సప్రసర త్ప్రథిత ప్రసన్నతన్ ౯౯

కం॥ అనుపమ సంవిద్రూపిణి !
నిను విడి యిటఁజేరి ధ్యాన - నిష్ఠాపరతన్
గనుతఱిఁ జీఁకటి - వెలుతురు -
పనుపడు నిద్దురయు హాయిఁ బ్రబలుట చేతన్ ౧౦౦

కం॥ వానంగల యర్థములే
మేనియు నెఱుక పడకునికి - నీవైన, సమ
జ్ఞానన్ గనునటు పల్కం
గా నేర్తువటంచుఁ బిలువఁ గాంక్షింతుఁ జెలీ ! ౧౦౧

కం॥ తెలిపిన విషయమ్ములు మది
నిలుపుదలను జేసి, ధ్యాన – నిష్ఠాస్థితిలోఁ
దెలియంగల యన్నియు నీ
తలఁ పున కెక్కించితిని, య – థార్థంబబలా! ౧౦౨

మ॥ అదియేకారణమో? యెఱుంగ, వివిధ
వ్యాపారముల్ చిత్తమం
దుదయించెన్ వివరింపు మట్లగుటకే
వో! హేతు భూతమ్ములో
ముదితా! నాపెను సందియమ్మడుపుమా!
బోధింపుమా! భూరిసం
విదఖండైక పరార్థ తత్త్వ మిపుడే
ప్రేమాను సంధాయినీ! ౧౦౩

కం॥ చీఁకటి వెలుతురు నిదురయు
రేకెత్తిన హాయిఁ గొంత – ప్రేరేఁచి తుదిన్
బోకడకున్ గారణ మెది?
నాకున్ దెలియంగఁ బల్కు – ననుఁ జాలుసకి! ౧౦౪

కం॥ ఇదియాత్మయొ? కాదో మఱి
యెదియో? తద్రూపమంద – యెన్నోమార్పుల్
బొదవెను ఙద గొద సందియ
మొదవెన్ మది యందు హేతు – వూహింపుమనన్ ౧౦౫

కం॥ కలయో? మానసిక భ్రమ
మలవడెనో? దీని మాన్ప - నగునో? కాదో?
తెలియఁగ నబ్బుర మబ్బెను
దలఁపఁగ నానంద వీచిఁ - దలఁగుట లయ్యెన్ ౧౦౬

కం॥ చిందఱ వందఱయై పెను
సందియములు డెందమందు - సందడి చేసెన్
సుందరి! యీ విషమస్థితిఁ
దొందరగాఁ బాపి సుఖముఁ దొడరింపు మనన్ ౧౦౭

కం॥ ఈమాదిరి పల్కిన యా
భూమీశుని జూచి " హేమ - పూర్వోక్తవిధుల్
నేమమునన్ వివరించెద
స్వామీ! విను మనియెఁ; మివుల - శ్రద్ధాసక్తిన్ ౧౦౮

గీ॥ పొందఁ దగినట్టి వస్తువా నంద మగునె?
ముందు లేకున్నఁగద! పొందు - టెందయినను
అది! స్వతస్సిద్ధ మగుట ను - న్నట్టి నీవు
మఱలఁ బొందుటయనఁ; భ్రమ - మాత్రమగును ౧౦౯

గీ॥ చీఁకటి చనంగ దీపమ్ముఁ - చేతఁబట్టి
క్రొత్తగా వెల్గువచ్చి న - ట్లు త్తమిల్లు -
వెలుఁగు మునుపున్నదే! గదా! - వెలసె నెద్ది?
కప్పిన తమమ్ము వో? వెలుఁ - గప్పటిదియె! ౧౧౦

వ॥ మఱియు నొక దృష్టాంతము వినుతునని - ౧౧౧

కం॥ దీప మొకప్పుడు చీఁకటి
రూపరయఁగ వెదకి కడకు - రుపరి శ్రమలన్
దాపమ్ముఁ బొందె జ్ఞానము
దీపింపఁ దమమ్ము వాని - దెసలును వెలుఁగున్ ౧౧౨

చం॥ ఇది యిటులుండు నంచు, ఋజు
వేర్పఱుపన్, వచియింపఁ, జూప, నె
మ్మదిఁ దలపోయ వీల్పడద
మాంతము సొంతము సొంత వెల్గుతోఁ
గుదిరిన యమ్మహస్సెఱుకఁ
గోరి తనంత నెఱుంగ నొప్పగున్
గుదిఁగొని పెన్ వికారముల
కున్ గుఱియై కలఁగించె మిమ్మిటన్ ౧౧౩

గీ॥ పెట్టె నున్నట్టి బంగారు - గుట్టు మఱచి
వెదకి వేసారి జ్ఞప్తియౌ - పిదప దానిఁ
గాంచి క్రొత్తగ నార్జించి - తంచు నెంచు
వానివలెఁ గను మాత్మయె - ప్పటికిఁ గలదు ౧౧౪

ఆ॥వె॥ అద్దమందు వస్తు - లన్నియుఁ గనఁబడు
నుడుగ నగును నద్ద - మున్నదున్న
యట్లుఁ దోఁచు బ్రహ్మ - మంతియ యీజగ
త్కల్పితములు వొడముఁ గడచు నెడఁద ౧౧౫

కం॥ మెలకువ నిద్దుర నడుమను
గల స్థితి వస్తువులఁ దెలియఁ - గలస్థితిఁ దెలివిన్
దెలిసికొను స్థితిని మేల్కొల్
వలసినటుల్ దెలియఁ - దెలియ - వలసిన దున్నే? ౧౧౭

గీ॥ ఈస్థితి నెఱుంగమిని గల - దెంతయేని
పంచభూతాత్మకమ్ము వి - శ్వమ్ము నందుఁ
దనరు, సకలమ్మదే; యెఱిం - గిన భ్రమమ్ముఁ
వాయు నిశ్చల సంస్థితి - వఱలుఁ గొఱలు ౧౧౮

కం॥ మది, లోఁగొని నీలో నీ
వెదిరి కనుంగొనిన 'నాత్మ' - యే నీవగుటన్
విదిత మగున్ లోఁబడు విధ
మెదియో? పల్కెదను శ్రద్ధ - నిది విన వలతున్ ౧౧౯

గీ॥ విషయముల నుండి నీ మది - వేఱుఁజేసి
నే నరయుచుందునను యూహ - నిలిపి మనసు
లోనికిన్ ద్రిప్పికొని గ్రుడ్డి - వాని వోలె
నున్నఁ, జూపును జూపు లే - కుండు టగునె? ౧౨౦

గీ॥ అప్పుడేస్థితిలో నుండు - నదియె నీకు
స్వస్వరూపము దానికై - వలయు గాఢ
యత్నమొనరింపు మనఁ బ్రియు - రాలి మాట
మానకయ నిర్వికల్ప స - మాధి నండె ౧౨౧

ఆ॥వె॥ కాల మిట్లు కొంత - గాఢ సమాధిలో
నుండఁ జూచి భార్య - యూరకుండి
యెఱుక దొఱికి పోయి - మరఁగి సుఖించెనం
చాత్మ విభుని లేప - కరయుచున్న ౧౨౧

చం॥ తదుపరిఁ గొంత సేపటికి
ధ్యాన మహోన్నతి వీడి బాహ్యసం
పద నొకసారి చూచి తరు
వాతతటాల్న సమాధి నిష్ఠఁబెం
పొదవఁగఁ గన్ను మూయు నపు -
డొయ్యన భార్య కవుంగలించి కెం
పెదవిఁ గదల్చి యిట్టులనె!
ప్రేమఁ గడల్కొను సద్ధితోక్తులన్ ౧౨౨

కం॥ కన్నులఁ దెఱచిన వెనుకను
గన్నులు మూసికొనుటేల ? కన్నులుఁ దెఱవన్
మిన్నేమి విఱిగిపడు లే
కున్నన్ లాభమ్మదేమి ? యెరగునొ ? చెపుమా ! ౧౨౩

కం॥ అని యడిగిన " హేమ " కు మ
త్తును గొను వానివలె నిటు బ - దులు వలికె, సఖీ
మణి ! పలుక కుండుటయు, లె
స్పని, మిన్నక యుంటి నేది - సరకుఁ గొనకయే ! ౧౨౪

కం॥ ఎన్నఁడుఁ బొందని విశ్రాం
తి న్నేఁడనుభూతమయ్యెఁ - దీరని దుఃఖ
చ్ఛన్నమగు జగతి నిట్టిది
యన్నల! మున్నెఱుఁగ నెంత - హాయి జనించెన్ ౧౨౫

ఆ॥వె॥ చెఱకు పిప్పి నమలు - తెఱఁగున, బశువులు
మేయు మేఁత నెమరు - వేయు చాయ
దుఃఖ భాజనమ్ము - దురిత ప్రపంచమ్ము
జోలి వలదు మదికి జాలి కలదు ౧౨౬

కం॥ ధనమింట నుండి భిక్షా
టన మొనరిచి బ్రదుకు జడుని - డంబున నానం
దనిధాన మెఱుఁగకయె, నేఁ
బెనుగాసిం బడితి జగతి - పీడ యిఁకేలా ! ౧౨౭

కం॥ జనులు సుఖంపడఁ గోరికఁ
గొని వెదకి తుదిన్ శ్రమమ్మె గొందురటుల్ నా
కనుభూతి యగుట వేసటఁ
గొని 'ఛీ' యని జగమె రోసి - కొంటిన్ మంటిన్ ౧౨౮

కం॥ నాయందే యానందముఁ
బాయక చూఱఁగొను కతన - బ్రాహ్మీ స్థితిలో
డాయుదు నిది నీవెఱిఁగియు
మాయ కనులఁగప్పి దాని - మఱపుట యేలా ? ౧౨౯

మ॥ నను విభ్రాంత గతాత్ముఁ జేసి మఱల
న్మాయా జగంబందు డిం
ద నెదం గోరెద వేలయన్న! ప్రియు న
ధ్యాఖ్యానముఁ గాదిదే
వినుమా! తాము వినిర్మల స్థితిని న
న్వేషింపలేదాకస
మ్మును భూమిఁ గల తారతమ్యమగుఁ ద్వ
ద్బోధ స్థితుల్ సూచినఁ ౧౩౦

శా॥ తామూహించు మనీష బుద్ధము విశు
ద్ధమ్మౌనె? యిద్దానికై
యేమాత్రమ్ముఁ బ్రయత్న - యత్నరహితా
త్రీహా నిరీహల్ ప్రతీ
క్షా మిధ్యేక్షణ లిట్టి వెట్టి వియు పీ
క్షా దోహద మ్మౌనె? తత్
సామీప్యస్థితిఁ బొందునే? యిది భ్రమా -
సంభూతమో! భూపతీ! ౧౩౧

కం॥ కనుమూసి సంతఁ గనఁబడు
ఘనతత్త్వముఁ దెలిచినంతఁ - గానంబడ కుం
డిన కొంటి జగము లొక మూ
లను గల పరిపూర్ణ మెట్టు - లఁగప్పఁబడుఁ - ౧౩౨

కం॥ కనుమూసిన గనుదెఱచిన
మునుకొని యేలాభ నష్ట-ములుఁ గలుగవు నీ
యనుభూతి నెఱుక పఱుపుమ !
కనుఁగొనుదును నీయెఱుంగు - కత లఖిలమ్ముల్ ౧౩౩

కం॥ కనుమూసి నప్పుడెయ్యదిఁ
గనుగొంటిరొ ? యద్దియే జ-గంబెల్ల వెలుం
గు, నది ప్రకాశింపని తల
మును, గలదే ? మూఁడు లోక-ములు గాలింపన్ ౧౩౪

కం॥ ఒక యంగుళపున్ నిడు వా
లిక కనుఱెప్ప లోగిఁ బక్షు-లింపమి భువనా
దికము విలుప్తమ్మగునా ?
కకవిక పాశేల ? వ్యాప-కమ్మది యగునా ? ౧౩౫

వ॥ మహాశయా! ఘోర సంసార బంధనోపయుక్త రజ్జు సంసక్త
గ్రంథి సముదాయ విశేషమ్ము లభివర్ణించెద - సావధానమతి
నాలకింపుమని - వేఁడి కోలు - ౧౩౬

సీ॥ గ్రంధులు విడనంత - కాలమ్ము సౌఖ్యమ్ముఁ
దవులదు మోహ ర - జ్జువున ముడులు -
కోటాన కోట్లుదఁ - గుల్కొని యుండు, శ
రీరమొ, తొలిముడి - రెండవదియొ,

విశ్వ, మాత్మాకృతి - వెలయు దలంపాత్మ
కన్న జీవుండుఁ ద - ద్భిన్నుఁడనుట
మూఁడవ దగు నిష్టీ - ముడు లనాదిగఁ బెక్కు
సుడుల జీవాత్మలఁ - జుట్టి కట్టి ౧౩౭

గీ॥ కట్టడులఁ బెట్టు జీవినిం - గడకు విడువ
గ్రంథులఙ్ గ్రక్కదల్చి ని - క్కంపుఁ ద్రోవఁ
వఱల నద్వైత మగుఁ బర - బ్రహ్మ మదియె,
కాన ! ముడులను విప్పు టెం - తేని లెస్స ! ౧౩౮

కం॥ ప్రతి బింబ మద్దమే, లే
ని తఱిఙ్ బ్రభవింపనట్లు - నిజముగ నాత్మన్
వ్యతిరేకించిన నునికికీ
గతి తప్పుఙ దాన శూన్య - కారణ మొప్పుఙ ౧౩౯

ఆ॥ వె॥ అన్ని వస్తువులకు - నాధారభూతమై
యున్న వస్తు వరయఁగన్ను మాయఁ
గానఁబడదె ? నేను - గనుచుందు, నేనెఱుం
గుదు నటన్న తలఁపు - వదల వలయు ౧౪౦

గీ॥ అవియె, గ్రంథులు - వానిఁ గ్రౌ - స్లైనఁ జిదిమి
స్వస్థితిం గనుటొప్పు నె - ప్పటికి నిట్లు
దెలిసికొని యుంట సంపూర్ణ - స్థితియ - మనసు
నిలిపినను జూడ నిమ్మన్న తలఁపు లేల ?

గీ॥ బలితపు దలంపులను, దారు - వులను లోని
కీడ్చుకొని వెల్గుపరమాత్మ - యెందులేడు ?
ఇద్ది నే గాననెడి గ్రంథి - నేని విప్పి
యంతటను నేను గలనని యరయు మాత్మ ! ౧౪౨

గీ॥ అద్దమున బ్రతిబింబమె - ట్లన్ని వస్తు
వులను నీవుండు నట్టులే - తెలిసికొనుము
అన్నిటను, నేను, నాయందె - యన్నియుండు
ననెడి తలఁపును గూడ ద్రో - య వలెఁదుదకు ౧౪౩

గీ॥ అది నిజస్థితి పరమాత్మ - యందె యునికి
యంచుఁ బలికిన భార్య ప - ల్కాలకించి
నెమ్మదిని నమ్మి భ్రమను బోఁజిమ్మి తత్త్వ
మెఱిఁగి సహజగతిఁ రాజ్య - మరసెరాజు ౧౪౪

గీ॥ అది మొదలొక్కని రాజకీ - యముల లోటు
పాటు వాటిల్ల కిలనేలె - సాటివారుఁ
దదనుయాయులునై మహా - తత్త్వమెఱిఁగి
యిరువుఁ బొరువుల కెంతొ ? బో - ధించిరంత ౧౪౫

ఆ॥వె॥ కొడుకు ముక్తుఁడగుటకున్ మది యోజించి
తండ్రి "ముక్తచూడ" - ధరణి విభుఁడు
సోదరుండగు "మణి - చూడుఁడు" ద్వివిద్య
నెఱిఁగి మివులఁ దలఁచి - రిట్టు లవల ౧౪౬

కం॥ నిన్నటి మొన్నటి వఱకీ
తెన్నున గల "హేమచూడ" - ధీమణి నేఁడా
పన్నివహ మెన్ని తన్నిన
మిన్నక గంభీర జలధి - మెయి నుండు నహా! ౧౪౬

గీ॥ ఇంత రాజ్యముసేసి యే - మేనిఁ గలఁతఁ
బొందఁ డాదర్శమూర్తియై - పొలుచు వీన
నేదియో మార్పుఁ గలదని - యెంచి వాని
డగ్గఱిలి ప్రశ్న లేవేవొ? యుగడింప ౧౪౭

కం॥ అడుగుటయే తడవుగ మిడి
నుడుగు వడువునఁ గడింది - నుడివె నెడందఁ
గడియించు విద్దె నందఱి
కొడఁబఱచుట లెస్స యంచు - నూహించుటచే ౧౪౮

గీ॥ వారికందఱ కావిద్యఁబట్టు పఱుప
వారనుష్ఠించి వెదఁ జల్లి - రూరు నాడు
దాన నందఱుఁ దత్త్వవే - త్తలయి రంచుఁ
బలుకుదురు బలుకుదురు పా - టొలయు కతన! ౧౪౯

కం॥ ఆయూరు సత్యలోకము
ఛాయను - సత్యార్థ్యగమన - చరితార్థుల తా
వై యలరె! నచటి బాలురు
మాయురె! తాత్త్విక సమీక్ష - మాటాడుదురా! ౧౫౦

గీ॥ రాష్ట్రమున సుఖ దుఃఖ దూ - రగులు నగుట
జుట్టు పట్టుల, జుట్టాల - జూచువారు
వచ్చుచును బోవుచును నిచ్చ - మెచ్చుచుందు
రచ్చటఁ గలుగు విరక్తి - నాత్మశక్తి ౧౨౧

గీ॥ రాయబారులు నౌ పర - రాష్ట్రవాసు
లందఱకు వీరు వారని - యనఁగనేల ?
అరద మెక్కి వచించు రా - మానుజుని వి
ధమున వెదఁ జల్లె నాత్మ తత్త్వానుభూతి ౧౨౨

కం॥ అనగర మరసి యిది వి
ద్యానగర మటంచు "సనకుఁ"డనె ! మును మఱియ
చ్చో నెలుఁగించును జిలుకలు
మానిత గతిఁ దత్త్వబోధ - మధురోక్తు లిటుల్ ౧౨౩

గీ॥ ఆశ్రయములేదు వస్తుల - కాత్మలేక
యీ చరాచరములు దాని - వే ! స్వయంప్ర
కాశమయి సకలాధార - కారణమగు
దాని భ్రమవీడి స్వ స్వ రూ - పానఁ గనుఁడు ౧౨౪

వ॥ అని సర్వదా, సర్వథా గాన మొనరించుచుండు నట్టి "విద్యా నగరాధి నాథుఁడు" "హేమచూడ" మహారాజు "హేమలేఖ" వలన సకలోపనిషద్రహస్యము లాకళించి విజ్ఞానియై

ముక్తుఁడయ్యె నని యమ్మహా సంవిత్పరునివలన రాష్ట్రియు వెల్లఱు జ్ఞాన తేజోనిధులై ముక్తి పథంబుఁ జూఱఁగొనిరి. కావునఁ బరమార్థ సంపత్తు నాసించిన వారు సజ్జన సహవాస మవశ్యము సేయవలయునని గురుకులతిలకుఁడగు "దత్తాత్రేయుఁ" డుపదేశించిన భార్గవుండు విభ్రమాశ్చర్య చకితుండై శంకా శంకు నిపాత భీత హృదయమ్మున గురు దేవునితో నిట్లుఁ బ్రశ్నింప దొరంకొనె! ౧౨౩

## ఆశ్వాసాంత పద్యము.



కం॥ అనలేందు రవి ప్రభ లె
వ్వని ప్రాపున సంతతమ్ము - స్వాభావిక దీ
ప్తిని గూర్పఁగ వెలుఁగుఁ ద
ద్ఘన సచ్చిచ్ఛక్తి భక్తిఁ - గైమోడ్పుడుదున్

## గద్యము

ఇది శ్రీ వైద్యవిద్వత్పండిత సత్కవి నారునాగనార్య విరచిత శ్రీ త్రిపురారహస్య మందలి ద్వితీయ కోశము

సమాప్తము.

★



# శ్రీ త్రిపురా రహస్యము

## తృతీయ కోశము

కం॥ కోహం తత్త్వ విచార
వ్యూహాతీత స్వరూప! యురు భాస్వత్తే
జోహత కోటి దివాకర!
సోహం స్వస్వాకృతీ! వి - శుద్ధాను గతీ!

కం॥ గురువర! భవదాశయ మన
గురుతర ము, నిగూఢ మనమ - కోవిదవేద్యం
బురుతమ సంశయ, మనుభవ
విరోధ మని పల్కుటకును - వెలివుంగలిగెన్ ౧

కం॥ కనఁబడు జగ మాత్మాకృతి
యని యెటు పల్కంగఁ దగు, మ - హా విశ్వాస
మ్మున నూకొంటిని యించుక
యును నాకున్ బోధ పడద - నూహ్యం బగుటన్ ౨

గీ॥ ఆత్మతత్త్వము విషయశా - న్యమగు కతన
నూహకును సాధ్యపడదాత్మ - యునికిఁ గూర్చి
నమ్మ వీలాదు తద్విష - యమ్ము, సులభ
బోధనా పదతిన్ బల్కు - ము బుధవర్య! ౩

కం॥ అన విని " దత్తాత్రేయుఁడు "
మనసుంచి, యితండు తత్త్వ - మార్గేచ్ఛువునై
మనవినిఁ జేసి కొనెఁ దా
నిని విని సందియముఁ దీర్ప - నెఱతన మనుచున్ ౪

గీ॥ కంటి కగపడు దృశ్యముల్ గారణమ్ముఁ
గలిగి తీరును దానికిఁ - గర్తయొక్కఁ
డుండవలె భువనమ్ము న - ణూదయమున
గలిగినం గాని దానికిన్ గర్తఁ గలఁడు ౫

గీ॥ కారణము లేక కార్యము - గలుగ దెపుడుః
గనఁబడని మాత్ర నెపుడేని - కర్త లేడె?
జడము చైతన్యముగ మారు - పడుట కల్ల
" కుండ " యుండినఁ గుమ్మరి - గూడఁ గలఁడు ౬

ఆ।వె॥ పనులొనర్చు నపుడ - బాహ్యజగతి నున్న
యాత్మరూప మెట్లు - లమరు మనకు
నట్లె! విషయ శూన్యుఁ - డయి జగత్సృష్టికా
రకుఁడుఁ బరుఁడు వేఱఁ - బ్రస్తుటమగు ౭

గీ॥ తలఁపు లెదఁ బుట్టి వివిధా - కృ-తులు వహించి
పెరిగి విరుగు నటుల్ జగం-బరయఁ గలుగుఁ
బరునిచే, లో నడంగు స్వ - భావ కలన
నాత్మ కీశ్వరునకు భేద - మలఁతి లేదు ! ౮

గీ॥ దర్పణ బలమ్మొ! ప్రతిబింబి - తమ్మొ లట్టు
లాత్మజన్యమె, జగముఁ త - దమలతా వి
భూతిచేఁ దారతమ్యతఁ - బొడము - వస్తు
లంతటికి నాత్మ మూల హే - త్వంతరమ్మొ ౯

గీ॥ కలువుటయు వేఱుసేఁతయుఁ గాని యాత్మ
యాకసము వలె విమలమౌ - నద్దమున్న
యెడల వస్తువులగపడు - వడువు వెలయు
జగము మఱి యాత్మచేఁ బ్రకా - శమ్ముఁ గాంచు ౧౦

గీ॥ కనఁబడని దాని నమ్మొటె - ట్లని? తలఁతువు
బాహ్య విషయాశ్రయ విచార - పథము సరియె?
యన్నిటికి వెల్గుఁ గూర్చు సూ - ర్యప్రకాశ
మను వగునె? "గుడ్లగూబ కిం - తైనఁ గాని ౧౧

గీ॥ ఇంద్రజాలికు నిర్మిత - మైన పనులు
నిజముగాఁ గానఁబడి, మఱు - నిముస మందె
తనకులోఁబడి కనఁబడ - కునికి వోలెఁ
బరునిచే సృష్టి మాయమౌ - తిరుగు లేక ౧౨

కం॥ సువిచారణమున మార్పుం
దవిలి నిజమ్మెఱుక వడును - దర్పణబింబ
ప్రవిచార మూలమున మా
ర్పవు, నన్నియు, విషయ బాహ్య - మపుడేమగునో? ౧౩

కం॥ ఒకరికి సరిపడునది వే
ఱొకరికి సరిపడదు హేతు -వూహింపఁ జిదా
త్మకు సర్వశక్తు లుండుటఁ
బ్రకటిత తచ్ఛక్తి యిట్లు - పరిణామ మగున్ ౧౭

గీ॥ లోకమంతయు సచ్చిదా - త్మాకృతి యని
నిర్ధరించిన గురుదేవు - నిం గనుఁగొని
తాముచెప్పిన దంత య - థార్థమనుచుఁ
గాదనుచు నాకుఁ బల్క వీ -ల్గాదు గాని ౧౮

కం॥ లోకము సుస్థిరమనియే
నాకున్ గనిపించు నీ - జ -నమ్ముల మదికిన్
గైకోలగు నదియే, మి
వాకునకున్ దెంతు సత్య - వాదం బెదియో? ౧౯

గీ॥ విభ్రమ భ్రమణాత్మఁ గం - పించు నన్నుఁ
దేర్చి బోధానుభూతిఁ జే - కూర్చుమనిన
" దత్తగురుఁ " " డంత" భార్గవు " - దరికిఁ జేరి
పలికె నీరీతి పీయూష - మొలుకు భాతి ౨౦

కం॥ ఒక వస్తువునం గొని వే
ఱొక వస్తువటంచు నెంచు - టొగి భ్రమయౌ, దా
నికి సదుపాం యంబొక్క టి
ప్రకటింతును వినుము! దీని - పద్ధతిఁ గనుమా! ౨౧

గీ॥ అహ మెఱుంగని కతన రా - మా! చిదాత్మ
నెత్తు రెమ్ములు మాంసమ్ము - నిండు - తనువుఁ
వలెఁ దలంచును విభ్రమ - పరత భావ
సాతిశయమున దనువునే, యాత్మగాఁగ

గీ॥ ఎవ్వరెట్టులు భావింప - నెనయు నట్లు
గావున విరుద్ధభావ సం - గ్రామ మహిమఁ
నట్టి విభ్రమ బుద్ధి బి - ట్టడఁగి ముడుఁగుఁ
యోగు లాగతిఁ దలఁచెద - రుచితగతుల

కం॥ కలదీ విషయము సెప్పం
గల కథ మున్నాంధ్రిలో జ - గత్పతి నా రా
ట్తిలకుఁడు ప్రజానుమతి భూ
లలనను బాలించె సాధు - లక్షణుఁ డగుచున్

గీ॥ అతని తమ్ముడు "గజపతి" - యనెడు నృపతి
కలఁడు భ్రాత్రాజ్ఞ మీరక - కలను నైన
నట్టి తఱిని "జగత్పతి యశ్వమేధ
యాగ మొనరింప విడెచెఁ దా - నశ్వమొకటి!

గీ॥ ఆ "జగత్పతి" సుతులు వీ - రాభిమన్యు
తులితు లద్దాని వింటఁ బో - గలిగి రందు
నందు మార్కొన్న నృపులనూ - టార్చి చేరి
రవల "బాహుద" యనునది - నశ్రమమున

గీ॥ అం“ దనంత – మహర్షి ” ఘో – రాజవంజ
వార్ధి నిస్తరణ ప్లవ – మైన నభవుఁ
గూర్చి తప మొనరించి ని – గూఢ గమ్య
నిర్వికల్ప సమాధిలో – నియతుఁడైన ౨౪

కం॥ అమ్మౌనిని గమనింపక
ప్రమ్మిన కార్యభర దృష్టిఁ – ప్రభు సుతులట వే
గమ్మే దాటిన మునిసుతుఁ
డుమ్మలికన్ గినిసి గుఱ్ఱ – మొగిఁ బట్టుకొనెన్ ౨౫

కం॥ ఆరాట్సుతునకు మౌనికు
మారునకున్ బోరు జరిగె – మల్లామడిగాఁ
బోర నదృశ్యుండాయెను
వాడువమున్ గొని ముని ప్ర – వర సుతుఁడు – వనిన్ ౨౬

కం॥ శ్రీశేషాద్రి సొరన్ భూ
మీశ సుతుల్ దాని ప్రక్క – లించిరి సిత తీ
క్ష్ణాశుగ తతి ముని తనయుని
కాశానిర్భేద్య సైన్య – మాయ త్తంబై ౨౭

కం॥ పోరాడి రాజసైన్యము
తూరుందుండెము లొనర్ప – దొర బిడ్డల శై
లారణ్య గుహల జెఱనిడఁ
బాటిరి హతశేష లాత్మ – పరివృఢు కడకున్ ౨౮

గీ॥ ఉన్నసంగతిఁ జెప్పి వా - యోడ భటుల
నిజ మెఱిఁగి "జగత్పతి" వృజిన కార్య
మిద్ది వేవేగఁజని సంయ - మీంద్రుఁ వేఁడి
సుతుల విడిపింపుమని పంపె - సోదరవరు ౨౯

కం॥ "గజపతి" పోయి జగమ్మున
గజిబిజి సద్దడఁగి నిర్వి - కల్ప సమాధిన్
నిజమరయు మునికి సతులిడు
చు, జగాఁ గొండాడ మౌని - సూనుఁడుఁ గాంచెన్ ౩౦

కం॥ ఆ "గజపతి" సేఁతకు మది
యోగికుమారుండు మెచ్చి - యోగక్షేమో
ద్యోగమ్ము లడుగ వినయ
ప్రాగల్భ్యుఁడు గతమునున్ స - రాసరి పలుకన్ ౩౧

ఉ॥ మెచ్చి యిటేల వచ్చితిరి ?
మీపను లెయ్యవి ? యిందురాఁ గతం
బిచ్చ నెఱుంగఁ బల్కుమన -
నెంతయు సంతస మంది - యోసము
ద్యచ్చరితా ! సమాధి సము
దగ్రుని ద్వత్పిత సంప్రతింపఁగా
వచ్చితి నన్నుఁ దాబదులు
వల్కె మునీంద్రజుఁడార్య చంద్రుఁడన్ ౩౨

గీ॥ పూజ్యపాదు 'లనంతుఁడె – ప్పుడొ ? కదయ్య !
ద్వాదశాబ్దమ్ములకు నొక – తడవ లేచు
నేఁటి కైదేడు లయ్యె మీ – బోటి షారి
కోర్కిఁ దీర్పఁదదాజ్ఞమై – కూర్తు నేను 33

వ॥ అనినఁ బ్రజ్ఞా సాంద్రుఁడగు నయ్యార్య చంద్రునకుఁ బునః
పునః ప్రణామమ్ము లొనరించి " గణపతి " భూపతి – యిట్లు
విన్నవింపఁ దొరంకొనె 34

శా॥ నాకోర్కుల్ నెఱవేర్చుచో – మునిమణీ
నాతోడ మాటాడు న
ట్లాకాంక్షల్ సమకూర్పు మియ్యదియె, నే
నాసింతు నన్నీ మహీ
యాకూతమ్ము లమోఘముత్ సులభసా
ధ్యంబౌనె ? వెన్వెంటనే
యేకమ్మై విషయాళ్యపానమున నెం
తేఁ బ్రాణముం గూర్చుచున్ 35

ఆ।వె॥ స్థూలతనువు నుండి – సూక్ష్మమౌ ప్రాణమ్ము
యోగ మార్గ విధిఁ బ్ర – యోగ కలనఁ
బిత్రు శరీరమున బ్ర – వేశించి నిర్వి క
ల్పము వికల్ప భంగి గ్రమత మార్చె 36

ఆ।వె॥ అపుడ చూచె ముందు "నయ్యనంతానందు"
డెదుర నంజలించు – నృపవరేణ్యు
నాదరించి విషయ - మంతయు నాలించి
సుతు గణించి హితము – మతిఁ దలంచి 33

మ॥ ఇఁక ముందిట్టులు సేయ నొట్టుసుమి, యెం
తే! రాజులోమన్ దపో
ధికు లాత్మావసరమ్ముఁ దీర్చు కొని సా
ధింపన్ నిజోత్పన్న కా
ర్య కలాపమ్ములు హోయి! నుందు రెపుడా
ర్షప్రాయు లత్యంత నీ
తి కళా కోవిదులై మనన్ ప్రజలుఁ ద
ప్రీతుల్ విచారింపరే ? 37

కం॥ యతులకుఁ గోపంబుండిన
బ్రతుకుదురే, ప్రజలు బలుత - పము లెంపులకో ?
మతిమత్త విమర్శనలకు
సతమున్ గుఱిగారె ! యదియు – సముచిత మగునే ? 38

కం॥ ఇతరులకుఁ బలుకనేర్చిన
యతులే కోప ప్రవిష్టు – లై కూర్చున్నన్
ఋత మన్వేషింపఁగ జీ
వితె మెట్టులు ? గడపుటకుఁ బ్ర – వేశాస్త్ర లోకో ? 40

కం॥ శాంతియు దయయు నహింసయు
దాంతియు క్షమ సూనృతమ్ము - ధర్మము సుగుణం
బెంతయుఁ గల్గి విధుల్ నలు
సంతయు వెలివోక చేయ నగు మౌనివరుల్ ౪౧

కం॥ మనుజ విభుఁ డెందుకొఱకై
మనకడ కేతెంచెనో ? స-మంజసగతి వా
రిని బనుపు సేఁత ధర్మము
తనయా ! విధ్యుక్తమును ప్ర-దర్శింపు మిఁకన్ ౪౨

కం॥ అని పలికి నృపునికిన్ ప్రియ
మును జూపిన "నార్యచంద్ర" - ముని వరుఁ డశ్వ
మ్మును నృపతనయుల, రయమున
ఘనశైలము పొచ్చి తెచ్చి "గజపతి' కిచ్చెన్ ౪౩

ఉ॥ వారువమున్ నృపాత్మజుల
వైళమ యింటికిఁబంపి యప్రముం
గూరిన సేఁతలన్ మనసు
కోర్తలు వెట్టఁగ మౌని చెంతకున్
జేరి, మహాశయా ! యిది వి
చిత్రముఁ గూర్చె సవిస్తరమ్ముగాఁ
పేరుకొనన్ దలంతు ననఁ
బెద్దియుఁ ప్రొద్దుఁ దలంపు నింపుచున్ ౪౪

వ॥ రాజవతంసమా! ఈ విషయ మతిశ్రద్ధగా నాలింపుమని శ్రీ
మత్పరమహంస పరివ్రాజకాచార్యుండగు 'ననంతానందఁ' యోగి
వర్యుఁడిట్లు క్లుప్తగతిన్ వక్కాణింప దొరంకొనె నెట్టులన ౪౩

ఉ॥ ఏ నొకరాజునై దెసల
నేలుచు నుండి మహేశుఁ గొల్చి వి
జ్ఞానముతో జగమ్మిది, య
సారమటంచుఁ దలంచి రాజ్యమున్
సూనుల కప్పగించి వనిఁ
జొచ్చి తపమ్మొనరింప భార్య నన్
మానక వెంట నంటి బతి
మాలిక సేవలొనర్చు చుండినన్ ౪౪

శా॥ కాలంబిట్టులుఁ గొన్ని యేండ్లరిగె మ
త్కాంతాలలామం బెదన్
గీలించెఁ మదనాగ్ని తాప భరమున్
గ్రేవన్ సమాధిస్థు న
న్నాలోకించియు పిలుఁగాక తనలో
నస్మత్కళా రూపమున్
బాలించెన్ రతి సౌఖ్య తత్పరత గ
ర్భంబాయె నూహాగతిన్ ౪౫

కం॥ తదుపరిఁగాంచె నీతని య
థామతిఁ బెంచితిఁ బెద్దవాఁడునై
పిదప మదీయ పూర్వ పృథి
వీ పరిపాలన గాథ లెంచి తా

సదె ! నిజయోగ శక్తి, మహి
మాంచిత రాజ్యము గూర్చె నీ యెడన్
ముదమున దత్పదాధికృత
భూనుత కార్య భర ప్రవిష్టుఁడై ౫౮

గీ॥ అందులో నశ్వమును భవ – దగ్ర జన్మ
సుతులు బంధింపఁ బడిరనఁ జోద్య మిద్ది
యానుపూర్వ్య మెఱింగింప – ననువఁటంచు
వ్రాఁగిపడి మ్రొక్కె ముని పదా – బ్జాతములకు ౫౯

గీ॥ ఈ విషయ మంతఁ జూపింపు – మితని కనుచు
నార్యచంద్రుస కాజ్ఞ నీయఁగ ననంతుఁ
డపుడు తలఁదాల్చి తనతండ్రి – యానఁగాన !
'నంతయును' జూపఁ గడఁగె నార్య ముని 'వరుఁడు' ౬౦

వ॥ అంతఁ దచ్ఛైలముఁ బొలింబాటి రమ్మని పిలువ "గజపతి" రాలేకునికి నిమ్మహాద్రి యోగాభ్యాస విరహితులుఁ బొంద నేరరని, యయినను నాతండ్రి యాజ్ఞ యనుల్లంఘనీయ మగుటంజేసి తప్పక నిన్నుఁ గొంపోయి తీరవలెనని యా స్థూల శరీరమును వదలి సూక్ష్మ శరీరముతో రమ్మని చెప్పిన విని యమ్మహీపతి యిది యేదో ? క్రొత్త విషయముగా నున్నది, నాయెఱుకకు దవిలినది కాదనిన వెంటనే "యార్య చంద్రుఁడు" సూక్ష్మ శరీరము విడదీసి – స్థూల శరీరమ క్కడి పొదలలోఁ బదిల పఱచి యాపర్వత గుహాంతరాళమున

ప్రవేశించిన నెన్నఁడును గని విని యెఱుఁగని వింతలు విశే షములు సూచి నివ్వెఱపడి యొక గోతిలోఁ బడునట్లు భయ భ్రాంతుఁడైన రాజున కభయ హస్తంబొసంగిన మఱి కొంత దవ్వు చని చని సప్త కుల పర్వతములు, సప్త సముద్రములు, సప్తద్వీపములు మఱియు నానావిధ పశు పక్షి జంతు సంతా నమును చిత్ర విచిత్రాదిక వస్తు సముదాయములను దేవ తిర్మఙ్మనుష్య సంతతులింక నేమేమియో? యూహాకందని వియు వాకొన వీలుఁగానివియు నగు బ్రహ్మాండ మంతయు జూచి విస్మితుఁడై మునికుమారా! మన మిచ్చటకు వచ్చి యెంత కాలమైనదనఁ! గొన్నిసంవత్సరములే, కడచనె నని చెప్పిన నబ్బురపడి యయిన నే వచ్చిన పని యొకటి చేయుచున్నపని మఱియొక్కటి గదా! ఇంతయద్భుత సన్నివేశములుఁ గల్పిం చినమీరు ధన్యులరు. అయిన నేనొక్కటి యడిగెదను. ప్రకృ తము మాయగ్రజుఁడేమి? చేయుచున్నాడన? ముని కుమా రుండు నవ్వి మీరాజు మీపట్టణము పూర్తిగాఁ దాఱుమారయి నది పట్టణ ప్రాంతము పెను వాగయి పారుచున్న యది. మీకుటుంబ మంతయు మూలముట్టు నశించినదన, వెంటనే రాజు బోరుమని యేడువఁ దొడంగెను. అందుల కెంతయు "నార్యచంద్రుఁడు" దరహసిత వదనుఁడై 'గజపతి' తో నిట్లనియెను రాజకుమారా! ఈ ప్రపంచ మెప్పుడును నిత్య నూతనముఁగదా! కాలచక్ర పరిభ్రమణమునకు నంత యు లోను గా వలసినదే సుమీ! దీనికై యింత చింతింప నేల? యని యడుగ బంధు నాశమునకుఁ జింతింపరా! అందులో మదగ్రజుని వినాశమునకు వగవనా? లోక ములో నిది సహజధర్మము గదా! యనిన ముని సుతుఁడు

రాజుతో నష్టెడ్చినచోఁ బోయిన వారు మఱలవత్తురా, లోకమున సహజముగా నట్టున్నదా! అట్టి నమ్మకమ్ము లేకున్నచో? శోక సంతప్తుఁడ వైన నేమి లాభమని ప్రశ్నించి యంతర్నిహితత్త్వ మందిన సూక్ష్మ దేహమును యథావకాశమున స్వస్థాన ప్రవేశముం గల్పించి విశ్రాంతిపైయున్న తఱి. ౨౦

గీ॥ అగ్రజు విషాద వార్త దుఃఖాతిశయముఁ
గూర్పదే, బంధు శోకమ్ముఁ గూర్పు క్రీడఁ
గూడ శోకార్తిఁ గుందఁ డౌ - క్కో! యటన్న
నార్య చంద్రుండు బదులిట్టు లానతిచ్చె. ౨౧

గీ॥ "నీది కానట్టి దానికై -" నాది యంచు
"భ్రాంతి పడి నమ్మి చెడుట" యే - పాటి మేలు?
"నాది నాది" -యటంచు న - జ్ఞతను నమ్మి
మోసపోయిరి యెందఱో - మొద లెఱుఁగక ౨౨

గీ॥ స్వప్న సంగతు లెట్టు ల - సత్యమగునో?
యట్టులీ విశ్వ మెల్ల స-త్యమ్ముఁగాదు
గాన, శాశ్వతమును గాని - దాని గూర్చి
వగవఁ గొనరింత విజ్ఞులుఁ దగులు కొనరు ౨౩

గీ॥ జగము శాశ్వతమని యెంచ - శాశ్వతమగు
మిథ్య యనియెంచుచో? నది - మిథ్యయె యగుఁ
గాన భావానుసరణమై - క్రాలు భావ
విరహితమ్మైన లేదింత - విశ్వమేని ౨౪

గీ॥ కనఁబడిన వస్తువెల్ల నా - వని యటందు
ఇట్టి "నా వనునని' నేన - దెట్టు లగుదు
'నే, నన "నెవండు ? దెలియని - నీవు మాత్ర
వగవఁ గారణమేమి ? వి - భ్రాంతిఁ దప్ప ౩౮౨

కం॥ నీ కథ నీవే యెఱుఁగవు ?
లోకుల కథ లెఱుఁగ మదిని - లోలాయ పడ౯
బాకాలూదెవ వాత్మ వి
వేక విచారమున సర్వ - విషయ విదితమా ? ౩౮౩

గీ॥ తనువు నెన్నంగఁ బంచ భూ - తాత్మికమ్ము
పంచ భూతాల పంచత్వ - మెంచు టెట్లు ?
కాన ! దేనికి వగపు యీ - కాయ మన్న
నీది కాదేఁక శోకాని - కేది ? తావు ౩౮౪

ఉ॥ గారడివాని మాయఁగాని
కప్పలఁ బాములుఁ జూచి విభ్రమ
స్ఫారమతి౯ భయంబడరి-
సత్య మెఱింగి యొకింత భీతి వి
డ్డూరముఁ బాసి నట్టులుఁ గ-
డు౯ నరుఁడు౯ నిజతత్త్వ వేత్తయై
మారణ భీతిఁ జెందునె ! ప్ర
మాణమ్ము దప్పునె ? మాయఁ గప్పునే ? ౩౮౫

కం॥ నీతో పాటు జనింపవా ?
మాతృ జఠరగోళ గళిత - మలమున గ్రిములున్
నీతోఁ బుట్టులు నా మదిఁ
బ్రీతిని సమ బుద్ధిఁ గంటి - వే! యెపుడైనన్ ౬౦

కం॥ అని యడిగిన నివ్వెఱఁ గొని
మనుజాధిపుఁ డూరకుండె - బ్రమాన్పడి నాకీ
ఘనవిషయ మెఱుక పడదని
వినిపించిన రాజుఁ జూచి - వినివేశ మతిన్ ౬౧

కం॥ దృశ్యం బెన్నటి కైనను
నశ్యంబగు స్వప్నజగము - నశియించు నటుల్
వశ్య స్వప్నార్థమ్ము ల
వశ్యము జాగ్రత్తలో ని - వారణఁ గావే ! ౬౨

కం॥ ఈ బిడ్డ యెవ్వఁడనినన్
నా బిడ్డ యటంచుఁ బల్క - నా - నే, యగునా ?
నీ బిడ్డ నీవు కాదుగ
దా బాగుగఁ దీర్పు సేయఁ - దగు నుచిత గతిన్ ౬౩

ఉ॥ కాన ! నిజ స్వరూప మెఱుఁ
గంబడు నంతకు వట్టి భ్రాంతికిన్
లోనయి కంటికిన్ గనిన
లోకమె, శాశ్వత మంచు నెంచుచున్

నేనును నా యనుంగులని
　　నెమ్మది నమ్మి తపించి మాయచే
జ్ఞానము న్యూనమౌ కతన
　　సంసృతి సుస్థిర మందు రెమ్మెయిన్　　౬౫

కం॥ తన నిజ రూపం బెఱిఁగిన
వెనుక మఱే భ్రాంతి పొడమి - వెంగలులయి మా
యను గప్పి లోనుగా రెం
దును, సత మాత్మానుభూతి - తోవెలుఁగుటచే !　　౬౬

కం॥ అన విని "గజపతి" యతి పు
త్త్రునితో నిట్లనియె, నేమి, తోఁపదు బోధిం
చిన "గారడి - మాయలు" నిజ
మును గావిఁక జగము సత్య-మును గాదొక్కొ !　　౬౭

కం॥ కనులారఁ జూచుచుంటిమి
మనుజు లొనర్పఁబడు పనులు - మఱి యెన్నెన్నో ?
కనఁబడు చుండె విశేషము
లను బ్రత్యక్షమ్ము సూచి - లాతిఁ దలఁతురే ?　　౬౮

కం॥ మనుజ పతి కిట్టులనె ; న
మ్మని సుతుఁడగు నార్యచంద్ర - ముఁడు రాజా ! నీ
వనినవి స్వప్న సదృశములు -
గనుఁ గొనఁ గలలవి సుషుప్తి - గత మై పోవున్　　౬౯

మ॥ కలలోఁ గాంచిన వస్తువుల్ మెలకువన్
గన్పించునే? దృశ్య వ
స్తులు జాగ్రత్‌స్థితి నున్నదున్నటుల పొ
ల్పుంగాదె! యీలోక ము
జ్జ్వలమై కన్పడునే? సుషుప్తి నటు దృ
శ్యంబెన్న నశ్యంబగు౯
కల మేల్కొలివి రెండు సామ్యఫలముల్
గై సేయుఁ జర్చింపఁగన్ ౧౯

మ॥ భువనం బెప్పుడు శాశ్వతంబని తలం
పుం గొన్న చో శాశ్వతం
బవు, మిథ్యాగతి నెంచ నయ్యది యె, మి
థ్యావృత్తిఁ బాటించు నిం
దెవ రెట్లెంతురొ! యట్టులే నిజము మున్
దృష్టింపవే! కొండ లో
నవు నానావిధ దృశ్యముల్ నిజములే
యీ మాత్ర మూహింపుమా! ౨౦

గీ॥ ఒక్క యోజన విస్తీర్ణ – మున్న నగము
నంద, విస్తృతి జగ మొక్కఁ డరయ లేదె!
యది, యసత్యము ౘగద! దాని – నరయ నీభు
వనము మాత్ర మసత్యమై తనరు నిజము ౨౧

కం॥ అంతః కరణాదర్శము
నంతయుఁ బ్రతిబింబితమ్ము - నవు భువనమ్ముల్
స్వాంతమున మిథ్య యనివిడి
నంత సుఖమ్ములరు దాని - కై వగపేలా ? ౭౨

గీ॥ మఱియు నొకమాట స్వప్న సంబంధమరణ
ములకుఁ జింతితువా ? యట్లె - మెలకువను, గ
లట్టి, సుఖ దుఃఖములకు దైన్యం బదేల ?
నిభృత నిరతిశయానంద - నిరతి - మనుమ ౭౩

చం॥ ముని సుతు బోధలన్ విని నృ
పుండొక కొంత విచారణమ్మొన
ర్చిన వెను వెంట భక్తి వివ
శీకృత చిత్తముతోఁ బ్రణామముల్
బొసరిచి, యార్య! తామిపుడ
బోధమొనర్చిన దాన సందియం
బు నొకటి దోఁచె భూరికృపఁ
బూనికఁ దీర్పుమ వాని వేగమే ౭౪

ఉ॥ భావముచే సమస్తము ప్ర
పంచమునన్ విలసిల్లు నంచు నె
న్నోవిధముల్ వచించితిరి
యుక్తము నయ్యు, ననేక యోచనల్

దీవరపాటుతో బయలు
దేరుచు నున్న మనఃపథాంతరం
చే విధమైన సత్ఫలిత
మించుక తోఁప దదేమి హేతువో? ౨౫

వ॥ అనిన "గజపతి" మహారాజున "కార్యచంద్ర ముని
వరుం డిట్లనియె" — ౨౬

కం॥ భావము రెండు తెఱంగులఁ
బ్రావిర్భావమగు సిద్ధ-మనియు నసిద్ధం
బై వెలయు స్థిర ధ్యానముఁ
గావించిన సిద్ధమగు వి-కల్పరహితమై ౨౭

గీ॥ తలఁచినది మఱపుఁ బొంది నం-తట గ్రమగతి
సిద్ధ సంకల్ప మందురా-స్థితి యదెంత
కాలముండునొ ? సిద్ధసం — కల్పఁమద్ది
గాన నితరమ్ముఁసిద్ధ సం-కల్పమగునె? ౨౮

గీ॥ పెక్కు సంకల్పములు వికల్పించుకతన
మార్పునుం జెందిఫలితమ్ముఁ — గూర్పవయ్యెఁ
గాన నీభావనాదుఁల — క్కాఱికొలందిఁ
ద్వరితగతి సాధనముఁసేయఁ-దగును-రాజ! ౨౯

గీ॥ అనిన నృపుఁ డిట్టులనె! దేశ-మనియుఁ గాల
మనియు రెండు తెఱంగులఁ-జనును మార్పు
దీనికిఁ గత మెదియొ ! ద — యానిధాన
తీర్చిదిద్దుమ ! నాదు, సం — దియమొకింత ౩౦

గీ॥ ఈ ప్రపంచానుభవ మొక - యింత లేమి
నిట్లుఁ గన్నట్టు వస్తుల - నైక భిన్న
దృష్టిఁ జూచుట కతనఁ గన్పించునట్టు
లంతయును గారణము భావ - నాతిశయమె ! ౬౧

గీ॥ భానుకిరణమ్ములోకమె ! ది - వాంధమునకు
శార్వరం బట్లు దక్కిన - జంతువులకు
వెలుతురుం బోలెఁ గనఁబడు - విధముఁజూడ
నీవిభేదమ్మునకు హేతు - వేది ? చెపుమ ౬౨

గీ॥ నరులకును జంతువులకు నూ - పిరిఁదిరుగని
నీటిలో జలచరమ్ములు - నెగడి యుండు
నిప్పుఁ గాల్చును మనుజుల - నీటియందు
నిప్పు మండుటకేమి వి - న్పింతువార్య ౬౩

గీ॥ ఒండొకటి భిన్న తత్త్వము - లుండుఁ బ్రకృతి
నంతయును ద్వైతభావ మొ - ప్పారు దాని
కారణము దృష్టిభేదమోఁ - గామెరలను
కలిగి చూచినఁ బచ్చగా - వెలయు జగము ౬౪

గీ॥ ఇతరమగు విషయములు సైత - మింద్రియ స్వ
భావమును బట్టి తోఁచుఁ బ్ర - పంచ మల్ల
బాహ్యమున లేదొకింత స్వ - భావముననె !
భువనమంత పృథగ్రీతిఁ - దవిలి యొప్పు ౬౫

గీ॥ వెలుఁగులన్నియుఁ జెలువొందు - వెలుతురందు
వెలుతురును వీడి వెలుపల - వెలుఁగు లేదు
వెలుఁగు వస్తులు వెలుఁగులో - పలిలె, వెలుఁగు
వస్తువును వెల్తురొకఁడైనఁ - బస నశించు ౮౬

గీ॥ భాస్య భాసకములు నొక - వస్తువందు
నెందుఁ గలుగ వొకే వస్తు - వీ సమస్త
జగము భాసించు నదిలేని - స్థానమేది ?
వెలుఁగుఁ గలిగించు నద్దాని - కలఁతియైన ! ౮౭

కం॥ వెలుపల లోపల నెందును
వెలిఁగిన నాయొక్క వెలుఁగె, వెలుఁగుఁ గొండఁ
గల శిఖర మభిన్నం బయి
వెలయదొ ? వెలుఁగించు వెలుఁగు వెలుఁగొక్కండై ౮౮

కం॥ జనులు స్వకీయ మతాదృతి
ననుయాయులునై స్వతంత్రు - లయి స్వేష్టమహా
స్వాను వివిధాకృతుల ననే
క నామములఁ బిలుచుదురు, ప్ర-కాశము పేర్మిన్ ౮౯

గీ॥ అద్దమున ప్రతిబింబిత - మైన వస్తు
వెల్ల నశియించినను నద్ద - మెట్లు సెడదొ ?
బహుళ సృష్టి స్థితి లయముల్ బఱఁగి నంత
నప్పరాశక్తికిన్ మార్పు - లలఁతి లేవు ౯౦

కం॥ అనియిట్లు బహుళ విషయము
లనుకంపన్ బెంపు నింపి యవనీశునకున్
వినిచిన వినయావనతా
ననుఁడగు నృపుఁ“డార్యచంద్రు - నకుఁ బ్రణతులిడెన్ ౯౧

గీ॥ భ్రమలఁ దొలఁగించి భావనా - బల మడంచి
యవిరళ సమాధి మించి, శాం - త్యధిగమించి
పొలిచె నవనీశుఁడని “యత్రి - పుత్రుఁ” డనిన
“భార్గవుఁడు” విని యాశ్చర్య - భరితుఁడయ్యె ౯౨

గీ॥ గురుని దరిఁజేరి, మాప్రభూ! - కొన్ని కొన్ని
సంగతు లెఱింగితిని భవ - త్సముఖమందుఁ
గాని యింకను దెలిసికో! గలుగు విషయ
ములుఁ గల వనేకములు కృపాం - భోనిధాన! ౯౩

గీ॥ ఆత్మ యొక్కటియే నిజ - మగుఁ దదన్య
మంతయు ననిత్యమగు నద్ద - మందు సర్వ
జగముఁ గనఁబడు వివిధమ్ము - లుగ సమస్త
వస్తులందిది మిళితమై పరగు ననుచు ౯౪

గీ॥ పల్కితివి తాము వస్తులో - పమున మిళిత
మైన నద్దానిఁ దెలియఁగా - ననుభవమున
కెట్టులగు? మానవుల కేది? - ధ్యేయ మట్టి
ముక్తిఁ గనుటెట్లు జగమున - ముక్తిఁగనియు ౯౫

గీ॥ తిరుగుదురు గద! చైతన్య - సిద్ధి యెట్లు?
వారు లోకవ్యవహృతిఁ గూ - ర్ప నెటులగును?
జ్ఞాన మొక రీతి నుండును - నైక విధులఁ
జెలఁగఁ గారణమేమి? వ - చింపు మార్య! ౯౬

సీ॥ బహుళ దేవతల స - ద్భక్తిఁ గొల్చెదరు, స
మాధి నిమగ్నత - మలయు చుంద్రు
శిష్యావళికి బోధ - సేయుచు నుందురు
నియమ నిష్ఠలను గ - ణింపుచుంద్రు
వేదాంత వాక్యముల్ - విప్పి చెప్పుచునుంద్రు
దాంభిక వాగ్వివా - దములనుంద్రు
కావ్య విరచనలఁ గాలమ్ముఁ బుత్తురు
చదువు సంజలను ని - చ్చలు గణింత్రు

గీ॥ మత్తులటు, నీచులటు భిన్న - మార్గములను
సంచరింతురు వీరిని జ్ఞానులనుచు
నెట్లు? గనుఁగొనవీలగు - నింతవట్టుఁ?
దెలియఁ బలుపుమ! యో గురు - దేవ! దేవ! ౯౭

శా॥ ఓరామా! కనుఁగొంటి నీయభిమతం
బుత్సాహ పూర్ణమ్ము జ్ఞా
నారాధమ్మున నిట్టులుంట సహజం
బౌ! యీశ్వరీ సత్కృపా

ధారమ్మె సువిచారమూలమయి ని
ర్ధారింప వీలౌను ధీ
సారధ్యమ్మున గొంత లోపమయి నీ
శంకల్ మదిన్ దోఁచెడిన్. ౯౮

గీ॥ ఆ పరమతత్త్వ మీవు భి - న్నార్థముగను
సదృశరూప మెఱుంగు క - శ్మలము కతన
నిజమెఱుఁగలేక పోతి, ని - ర్ణీత విషయ
దూరగుఁడ వైతి వియ్యది - తొలఁగ వలయు ౯౯

కం॥ ఇందుల కొక దృష్టాంతము
సందియమును మాని వినుమ ! జనకమహారా
జుం దనరె, మున్ను సంవి
త్సుందరుఁడు నిజాత్మ తత్త్వ శోభిత గుణుఁడున్ ౧౦౦

చం॥ అతఁడొక కర్మయోగి మహి
తాత్ముఁడు, జ్ఞాన సముద్రుఁ డాత్మసం
స్థితుఁడు మనీషి వర్యుఁడు, సు
ధీ ప్రణతుం డచలజ్ఞుఁడున్ సము
న్నతుఁడుఁ దలంచె యాగముఁ బొ
నర్పఁగ సర్వ కళావిశారదుల్
మతి గురు తుల్యు లెందఱో ? స
మాయితులైరి తదర్థ దీక్షకై ౧౦౧

గీ॥ వారు వీరననేల ? వి – శ్వమ్ము నంద
సకలశాస్త్ర విశారదుల్ – జ్ఞానధనులు
నాయితంబైరి జనకుని యజ్ఞమునకు
నపుడె ! వరుణుండుఁ దలపెట్టె – యాగమొకటి ౧౦౨

గీ॥ జగము నందలి పండితుల్ – చాలవఱకు
జనకు యాగానికేగిరి – మనుజుఁ డొకఁడు
వరుణు యజ్ఞమ్ము వంక కే – గురుగఁడయ్యె
జనకుఁ డొనరించు సత్కార – మును గణించి ౧౦౩

గీ॥ యాజ్ఞికులు లేక, ప్రేక్షకు – లసలు రాక
వరుణుఁ డంతటి వాఁడొన – ర్చుఁబడు సవన
మవమతిం బొంద మంతన – మాడి సుతునిఁ
బంపె విజ్ఞులఁ గొనితేర – వరుణుఁ డంత ౧౦౪

కం॥ వరుణసుతుఁ డపుడ మాయా
ధరణీసుర వేషియై వృ – థాప్రాగల్భ్యో
ద్ధుర పరుష వాక్పరంపర
గుఱిపించె సభాసదులు వి – గుర్వించు నటుల్ ౧౦౫

కం॥ తనతండ్రి చేయు జన్న
మ్మున కేగక యిందువచ్చు పోఁడిమిఁగని నె
మ్మన మోర్వక కుహనా పథ
మున లోఁగొని వారి స్వపుర – మున కంపుమిషణ ౧౦౬

గీ॥ అమ్మహాసభఁ జూచి తా - ననియె నిట్టు
లొకఁడు పండితుఁ డిచట లే - కునికిఁ దలఁప
నిదియు నొక జన్మమా! చూచు - నెట్టులిది, య
సహ్య మయి మాదృశులు సూడఁ జాలుటులవె?                    ౧౦౭

వ॥ అని వరుణ కుమారుండు సోల్లుంఠన పూర్వకముగా, స భా సదుల నవలోకించి పలికిన నటఁగల పండితులు మండిపడి యాగ్రహోదగ్రులయి నిగ్రహంబేది యిట్లనిరి - ఓహో! నీ వొక పండితుండవని గరువమ్ముఁ బూని యిటు లారడి సేఁత లకు, బాలువడ్డ నీ పెనుపొగరుం దనమ్ము నింత లంతలు గాఁ దున్మి తూటాడకున్న మాకళాకుశల హేవాకమ్ముఁ బాండితీ ప్రకర్షత్వమ్ముఁ దపో విభవాధికమ్ముఁ గాల్పనే యని జన్నిదమ్ములు సవరించు కొనుచు సమదర్శియగు శ్రీ జనక మహారాజు సమక్షమునఁ యజ్ఞ శాలాంతరమున సభా సమా వేశ మాయత్తపఱచి పెక్కు విధమ్ములఁ దర్క కర్కశ మగు మాయా వాదమ్మున నెదురొడ్డి యోడిన వారిని సంద్రమ్మున ముంచునట్లు పన్నిదమ్ము సఱచి యమ్మాయా వటుండు మౌని సంతానమ్ము నంతయు నోడించి సముద్ర గర్భమున ముంచి నంత వరుణాదేశమ్మున భటు లవ్వారిందోడ్కొని యాగశాల కుం బోయిన నవ్వారి నుచిత సత్కారముల మన్నించి నంతఁ గొంత సేపటికి సముద్రగతంబగు కపిల మహర్షి కుమారుఁ డవ్వార్త విని యా మాయా బ్రాహ్మణునితో వాదించి ప్రయోడించి పూర్వోక్త విధానమ్ము మేరకు నా బ్రాహ్మణుని సాగర గర్భమ్మునముంచునట్లుసేసి నేనింత వాఁడనని

యొక్కంత గరువమ్మాని యున్నంత నింతలో వరుణునికిం
దుష్టిఁ గూర్చివచ్చిన బ్రాహ్మణోత్తముల దనిసనఁ జేయుటకై
తపస్విని యొకరుక వచ్చి "అష్టావక్ర" మహర్షినిం జూచి
కుమారా ! ఈ బ్రాహ్మణ ప్రవరుల బంధవిముక్తిఁ గావించి
తివి సెబాసు – అయినను – నేనడుగు ప్రశ్నమ్ములకు వంచ
నామతిన్ గాకఁ ప్రత్యుత్తరమిత్తువా ! యని యడిగిన వెంటనే
యమ్మహర్షి సమ్మతించిన – ౧౦౮

గీ॥ ఏ నిజస్థితి నెఱుఁగ ల – భించుముక్తి ?
యేది ? తెలిసిన శంకాని – వృత్తి యగు, మ
తేది ? యెఱిఁగిన నెఱుఁగ నొం – డేది లేదొ ?
తెలిసికొన లేని వస్తు వె – ద్దియొ ? పలుకుమ ! ౧౦౯

కం॥ ఔనౌ ! నేనెఱుఁగుదు న
ద్దానికిఁ బ్రత్యుత్తరమ్ముఁ – దప్పక చెప్పఁగ
బూనుదునని "కపిలాత్మజు"ఁ
డీనియతిఁ దపస్వి నిఁగ గ – ణించి వచించెన్ ౧౧౦

సీ॥ ఆది మధ్యాంతమ్ము – లా ? లేని జగమొక్క
యద్దానఁ జూపట్టు – నట్టి పట్ట
ణమువలె వెలుఁగుచుఁగ – న్నన బ్రత్యగాత్మలో
నద్దమ్ము నిజరూప – మరయు నెడల

ప్రతిబింబ మెఱుఁగుట – భ్రాంతియే ! యీ జగ
మగును దత్ప్రతిబింబ – మని యెఱుంగ
మఱియేది కలదింక – నెఱుఁగంగఁ దత్స్థితిఁ
గల వానఁ గొరికల్ – గలుగ వలఁతి

గీ॥ యది యెసంగమి నెఱుఁగు వాఁ – డవనిఁగలఁడె ?
కాన నయ్యది తెలిసికో – లేని వస్తు
వంచుఁ దత్పరమ స్థితి – నాగమములఁ
బలుకఁ బడె నంచు మునికుల – తిలకుఁ డనిన ! ౧౧౧

కం॥ అందుల కానందముఁ గడు
నంది " తపస్విని " – కుమార ! యఖి లాదృతికిన్
విందగు నీ పలుకులు విన
సందర్భ విహీనములని – సంశయమయ్యెఁ ౧౧౨

వ॥ ఎట్టులన నొక్కింత వివరింతు వినుమని ౧౧౩

కం॥ తెలిసికొనువాఁడు లేడని
తెలిసికొనఁగ లేనిదనియుఁ – దెలిసికొనఁగ ము
క్తిలభించునని విపర్యయ
ములుఁ బలికితివిద్ది తగవు – హో ! నిజ మరయఁ ౧౧౪

కం॥ తెలిసికొన వలసినవియే
కలుగఁ దెలిసి కొనవలయుఁ గానీ ! దానిఁ
దెలిసి కొనలేని వస్తువు
వలె వర్ణించుటలు స్వానుభవ దూరమగుఁ ౧౧౫

గీ॥ బాపఁడా ! యిట్టి జనక స - ఖాంతరమున
బల్కెదవు సిగ్గు నీకు ర - వంత లేదె !
శాస్త్ర విహితోక్తులం బల్కి - స్వానుభవము
లేనికతమున బ్రేలితి - వైన మేలె ! ౧౧౭

కం॥ ప్రతిబింబము లరసి నిజ
స్థితియగు దర్పణవిధమ్ముఁ దెలిసి కొనవన౯
బ్రతివచన మాడ నేరక
యతిసుతుఁ డవనత శిరస్కుఁ డయి కూర్చుండె౯ ౧౧౮

చం॥ తదుపరిఁ గొంత సేపటికిఁ
దత్త్వ సమీక్షఁ బొనర్చి యేమియు౯
మది కపరిస్ఫుటమ్మగుట
మౌనము వీడి తపస్వినిం బదిం
బదిగ నొనర్చు బ్రశ్నలకు
మామక శక్తి కొఱంత యొూటఁ త్వ
త్పద యుగి నాశ్రయింతు నిదె !
పాహి ! కృపామతి నుద్ధరింపవే ? ౧౧౯

గీ॥ శిష్యుఁడను నేను సత్యముల్ - సెప్పలేన
టంచుఁ బల్కిన సుతువోలె - నాదరించి
యతని విజ్ఞానమునకు ము - దాత్మ యగుట
నాతపస్విని యనుభూతి రీతిఁ బలికె ౧౨౦

గీ॥ జనక నృపుఁడేనుఁదప్ప నీ - సత్య మెఱుఁగు
వారు లేరీ సభఁ బృహ - త్పండితులును
దర్క కర్కశ వాదాలఁ - దప్పదారిఁ
దారి తచ్చనలాడి మి - థ్యను గడింత్రు ౧౨౦

కం॥ దేవీ కటాక్షమును గురు
దేవుని కృపలేక యిద్ది - తెలియఁగ నగునే?
భావమున శ్రద్ధ లేమిని
వేవేల్ శ్రవణమ్మొనర్ప - వృథ గద భిడ్డా! ౧౨౧

కం॥ నేనెన్ని వేల సారులు
మానక బోధించినను సు - మా! నైష్ఠికతఁ
బూనమి ఫలోన్ముఖశ్రీ
యానే? యెవ్వారి కైన - నది సులభమ్మే! ౧౨౨

కం॥ వినుమొక దృష్టాంతం బొక
ధనికుఁడు ముత్యాల దండఁ - దస్కరుఁ డెవఁడో?
కొని చనెనని మదిఁ దలఁచెను
దన మెడలో నున్నదానిఁ - దా నెఱుఁగక యే? ౧౨౩

కం॥ పలువురుఁ బలికిన పలుకుల
కులికి పడును సొంత తెలివి - యోచింపఁడు నె
చ్చెలి వచ్చి యదిగో? నీమెడఁ
గలదని చెప్పినను వినఁడు - గాని యదెట్టో? ౧౨౪

క॥ తనచేతఁ దాను తడవిన
వెనుక నిజమ్మరయు తెఱఁగు - విప్రోత్తమ ! నీ
యనుభవము కొలఁదిఁ దెలిసిన
యనువున నొరులెంతఁ బల్కినంత ఫలమ్మే ! ౧౨౩

గీ॥ కనఁబడును వస్తువులు దీప - కాంతి వలన
గాని దీపముఁ గనఁబడ - గా మఱొండు
దీప మవసరముండదా - తెన్ను ప్రొద్దు
ముందు తద్దీప కాంతియే - డిందువడును ౧౨౔

గీ॥ అయిన దీపము లేదటం - చనఁగ నగునె ?
దీపికను గూడ వెలిఁగించు - దివ్యశక్తి
యాత్మకున్నది చిచ్ఛక్తి - యైన దానిఁ
గనుమ ! లోఁజూపునఁ బరీ - క్షను బొనర్చి ౧౨౫

చం॥ సకలము వెల్గఁ జూపునది
సర్వ పదార్థములందు సర్వదా
ప్రకటితమై సమస్త రుచి
వంతమునై వెలుఁగింత లేని దా
నికి నయితమ్ము వెల్గిడి క
నీనపుఁ జీఁకటిఁ జిమ్మి స్వప్రకా
శకమను చిత్స్వరూపముఁ బ్ర
సన్నము సేసి కొనంగఁ జెల్లదే ? ౧౨౬

ఉ॥ పండితులైన పెద్దలు వి
వాదములన్ బహుశాస్త్ర చర్చలన్

గండరగండలై బ్రదుకు -
కాలముఁ దేరకు వెళ్ళఁబుత్తురో

కొండును జిత్స్వరూప మెఱుఁ
గండిటులుండిన నిశ్చ యుక్తమో

చుండు ననాత్మవాదులుఁ బ్ర
యోజన శూన్యులు మాన్యులౌదురే? ౧౨౯

కం॥ చిదగోద మది వదలి పదిం
బదిగాఁ గుదిరిన గదయ్య - మహితాంతరదృ
క్ప్రదమున జిచ్ఛక్తి నెఱుం
గఁదగు వికల్పేతర సమాధి - కడకొదగూడున్ ౧౩౦

గీ॥ నిర్వికల్పముగా నున్న - నీవు స్వాను
భవము నందంగ నగు క్షణ - పరిమితియును
దదనుభవ మున్న నిను నీవు - తరళరుచుల
వెలుఁగుదువో? పరులచేవెల్గఁ - గలవొ? తెలియు ౧౩౧

గీ॥ తెలిసికొన లేనివస్తువుఁ దెలికొనుట
నిర్వికార స్థితింబొంద నేర్తుననుచు
నింక నేమేని యెఱుఁగ నూ - హింతురేని
జనక నృపుచే నెఱుంగనౌ - నని వచించె ౧౩౨

గీ॥ ఇట్లు వలుకఁ దపస్విని – నెంతయేని
గారవముఁ జూపి పూజింపఁ – గాఁదదుపరి
గాడ్పు వీచిన దూరానఁ గదలు మొయిలు
కరణిఁ జనె నాత్మ నెఱుఁగ సూ–క్ష్మమిది "రామ" ౧౨౩

కం॥ అని యీకథ గురువరుఁడున్
వినిచిన జమదగ్ని సుతుఁడు - విసమానమునన్
దనిసనక యత్రి పుత్రుని
కనియె, భపత్కథ విచిత్ర – మైనది కానీ ! ౧౨౪

కం॥ జ్ఞాన స్వరూప మెఱుఁగన్
గాన దయామతిని బలుకఁ – గాఁ బూనుఁడటం
చానత శిరస్కుఁడయినన్
మౌనీంద్రుఁడు పల్కె జ్ఞాన - మార్గ సమస్యల్ ౧౨౫

గీ॥ ఆ "తపస్విని" పోయిన యవల "జనక"
నృపుని కడకేగి "కపిల" ము – నీంద్ర సుతుఁడు
భక్తి జేజేలొనర్చి, త – పస్వినీ ప్ర
బోధ నాకర్ణమును గాక - బాధయయ్యె ౧౨౬

ఉ॥ కాన దయామతిం దెలియఁ
గాఁ దగుఁ దత్పరమార్థ సూక్ష్మమె
యైన నెఱుంగఁబల్కుమన
నా "జనకావనినేత" యో మహా

ర్షీ! నిజముఁ గ్రహింప మది
నిచ్ఛజనించిన సావధాన చి
త్తాన వినన్ దగున్ దెలియఁ
దగ్గది పల్కెదఁ జిత్తశుద్ధిమై ౧౩౭

గీ॥ ఎఱుఁగఁ బడనిది కాదది – యెట్టులనిన
వరుసగా గురుబోధనల్ – బఱుఁగు కతన
నెఱుఁగఁ దగినది కాదది యెట్టులనినఁ
దనకు నన్యమ్ము గాని వి–ధమ్మునగుట ౧౩౮

కం॥ ఒక్కప్పుడు సులభమ, వే
ఱొక్కప్పుడు గష్టమగుచు – నుండును దెలియన్
మిక్కిలి యం తర్దృష్టిని
దక్కును సులభమ్ము కష్ట – తర మితరమ్ముఁ ౧౩౯

కం॥ లేదని కాదని బహు విధ
వాదమ్ముల భేదముల స–భా దంభోక్తుల్
వాదింతు రాత్మనెఱుఁగని
జోదులు గమనింపకయె, య–శోచ్యవిధమ్ముల్ ౧౪౦

కం॥ తామయి వెలుఁగని వస్తువు
లేమెయి, వెలిఁగించు వెలుఁగు – నే యెఱుఁగఁ దగుఁ
నేమమ్మున నమనస్కత
నా, మహిత మహామహస్సు – స్వానుభవ మగున్ ౧౪౧

గీ॥ అన్ని వస్తులఁ దెలిసికొ - న్నట్టి తెలివి
కెప్పుడును మార్పు లే దది - యే స్థిరమ్ము
భేదములు లేవు రూపుఁ గ - న్పింప నట్టి
తెలివిపయి, వస్తురహితమౌ - దృష్టిఁ గనుము ౧౯౨

కం॥ మదిలో సంకల్పమ్ములుఁ
బొడలిన నవి భిన్నరూప - ములుఁ ద్రోయఁగ నే
నిదికా దిదికాదనుచున్
వదలిన మిగిలినది, యాత్మ - భాసించుఁ దుదిన్ ౧౯౩

గీ॥ అన్యవస్తులఁ గన్గొను - నట్టు "లాత్మఁ
దెలియఁగాదు తురీయమై - వెలయు కతన
నరయు మింక" నష్టావక్ర! యాత్మరూప
మీవె! నీవై విచారింపు - మీ! స్వయముగ ౧౯౪

చం॥ తనువు మనస్సుఁ బ్రాణమును
దప్పక మార్పగు నాశమౌ తుదిన్
గనుక, యవేవి? నీవియనఁ
గాఁ దగునే? యవి నీవు కావు కా
వున నహమంచు నేస్ఫురణ
పోదొ? యదే! పరతత్త్వ మీవె! నే
ననుభవ దూరమై పలుకు
నట్టిది కాదిది స్వానుభూతియౌ! ౧౯౫

కం॥ నీ యంతరాత్మ విడువక
నీయాంతర దృష్టితోడ - నీవైకనుమా !
పాయక జాప్య - మొనర్పని -
భూయిష్ఠ వరిష్ఠ నిష్ఠఁ బూనుమ తోడ్తో    ౧౪౬

ఉ॥ జ్ఞాన సమార్జనాభిమత
సంవిదు లాత్మ నెఱుంగ (గోర్కిమై
మానక యత్నగింతురొగి
మాంస మయేక్షణ మూని, యెంతయు
న్మానసికేక్షణమ్మున గ
నందగు స్వప్నమునందుఁ జూడఁగా
నైన సుదృష్టిఁ గావలయు -
నాంతర దృష్టి విధమ్ము బల్కెదఁ    ౧౪౭

ఆ॥వె॥ బాహ్య వస్తువులను - వదలి కోరిన వస్తు
వులను లగ్న మగుట - వలన మనసు
లగ్న వస్తువాత్మ - లక్షణ లక్షిత
మగుట సహజ రూప - మవుట యసదె !    ౧౪౮

గీ॥ దృశ్యముల నుండి మనసు మా-ర్పంప మలిన
రహితమై జ్ఞానమునకు దా-ర్కాణ యగుట
నాత్మ నిజరూప మెఱుఁగ వీ-లగును సకల
యత్నములు మానసికశుద్ధి - యగుట కొఱకె !    ౧౪౯

ఆత్మ దెసకు మదిఁ ద్రిప్ప ననవసరము -
మనసు నిర్మలమైన వెం - టనె, నిజముగ
నఖిల సంవ్యాపితం బాత్మ యగుట మనసుఁ
గూడ నాత్మాభిముఖమయి - కొఱలి వఱలు ౹౹౩౫౦౹౹

సకల కర్మలుఁ బూజలు - జప తపములు
మనసు నిర్మల మగుట కె - త్తిన ప్రయత్న
ములు గదా ! యింకఁ జిచ్ఛక్తి - వెలసి పొలుచు
నిర్మల మనోనుగత మయి - నిభృత రీతి ౹౹౩౫౧౹౹

అన విని "యష్టావక్రుం
డనె, నిటు" జనకాధి - పా ! య - నాత్మ విషయమఁ
మనసును మఱలించిన చో
ననువగు నాత్మానుభవమ - టందురు కానీ ! ౹౹౩౫౨౹౹

మనసు గాఢ సుషుప్తిలో - మగ్నమగునె ?
బాహ్య వస్త్వను బంధ మ - ప్పట్ల నాత్మఁ
గన్గొనఁగ సులభ మగుటను - గాఢనిద్రఁ
బనుపడిన జాలు ! యోగ సాధన లవేల ? ౹౹౩౫౩౹౹

అనవిని రాజిటుల్ వలికె
నద్ధరణీసుర వర్యుతో సుషు
ప్తిని విడి పోవు బాహ్య జగ
తిఁ మన సిద్ది నిజమ్ము వస్తులఁ

దనుకఁగఁ జేయు సాత్త్విక వి
ధమ్మగు చిత్తము పెఱ దమస్సులో
నణఁగుటఁ దత్స్థితిఁ మనసు
నాత్మఁ బ్రకాశ మొనర్ప నేర్చునే ?  ౧౫౪

గీ॥ అన్యవస్తువు లెటు ?సిరా – యద్దఁబడిన
యద్దమున గానుపింపని యట్లు మనసు
కడు సుషుప్తిని మత్తుతోఁ గలియు కతన
నాత్మ భాసింపఁ జేయ లే – దలఁతి యేని  ౧౫౫

కం॥ అరయ సమాధి – సుషుప్తుల
పరిగణన విభేద మింకఁ బలికెద మనసం
దు – రహించి రెండు దెఱఁగుల
మఱియుండుఁ బ్రకాశనము – వి · మర్శన, మనఁగఁ  ౧౫౬

గీ॥ బాహిరంబగు వస్తుల – పైన మనసుఁ
ద్రిప్పనదియే, " ప్రకాశన " – స్థితియగు, నీఁక
వస్తు విషయ విమర్శనా – వస్థతోడ
నూహలె " విమర్శన " స్థితి – నొప్పు మిగుల  ౧౫౭

కం॥ తొలు దొలుతటి స్థితిలో వ
స్తులగపడు సమష్టి రూపు – తో నవియే; వి
జ్ఞులు " నిర్వికల్ప " మందురు
పలు తెఱఁగుల రూపములను – ధ్వనులున్న యెడఁ  ౧౫౮

వ్యష్టి యనునది ‘ సవికల్ప ’ - మగును జాన
మలరుటఁ “ ప్రకాశనమ్ము ” నూ - హలు జనించి
మఱి విమర్శించునది యే, ‘ వి - మర్శనమ్ము ’
నిర్వికల్పము - సవికల్ప - ముర్వి వెలయు ౧౫౯

మెలకువను పరం పరలయి
తలఁపులు వెనుకొనుట జడముఁ - దవులదు ప్రత్యా
హలును, దమస్సున సుప్తిన్
గలుగవు లయమొందు మనసు - గాఢ సుషుప్తిన్ ౧౬౦

మనసు గాఢ సుషుప్తి కారణమున, లయ
మొందు నని మున్నువాకొని - యుంటి రెట్టు?
లయము సెందు ? మనస్సు ని - ద్రయను దానఁ
బాయక నిరూపణమొనర్చి - భాసమొందు ౧౬౧

అనిన భూసురుతో నృపుం - డనియె, నిట్లు
గాఢ నిద్ర మనోశక్తి కలియు సుప్ర
కాశ మందపు వృత్తులుఁ గలుగ వలఁతి
యది ‘ మనోలయ ’ మని విజ్ఞు - లనెద రెపుడు ౧౬౨

ఓయీ ! యష్టావక్రా !
నాయనుభవమందు మంత - నము వివరింతున్
ధీయుతులు సయిత మెఱుఁగక -
యీయంశం బజ్ఞులై - చ - రింతురు మివులన్ ౧౬౩

చం॥ సారిదిని "నిర్వికల్పము" - "సు
షుప్తి"యు దర్శనముఁ ద్రయీవిధుల్
బఱఁగుటచేఁ బ్రకాశమన
వద్యము వేద్యము నౌటఁ జోద్యమే !
పరి పరి రీతులఁ విషయ
భావము లెంతురు వృత్తిలోఁ బరం
పరయగు కారణమ్ములె; "స -
మాధి" నిజానుభవమ్ము నాత్మయౌ ౧౭౪

కం॥ ఇమ్మాఁట విమర్శన లే
శమ్మేనియు లేని కతన - శశ్వద్భాన
త్వమ్మగుట జ్ఞప్తి కిరవగుఁ
గ్రమ్మఱ క్షణికములుఁ గూడఁ గలవు సమాధుల్ ౧౭౫

గీ॥ గ్రహణ శక్తి నియుక్తులుఁ గల రెఱుంగఁ
దగిన వారొక కొందఱుఁ దఱకు వసమె !
మఱియు జాగ్రత్త.నందు స - మాధి, కొంత
కలుగును విమర్శన జ్ఞాన - మొలయ దలఁతి ౧౭౬

గీ॥ శూన్యమె, "సమాధి" యైన "సు - షుప్తి" వస్తు
పరిగణములో "సమాధి" స్వ-భావముండుఁ
గాని యీ రెండును "సమాధు" లే నటంచుఁ
బలుక వీల్గాదు భిన్న భావమ్ము కతన ౧౭౭

కం॥ అరయ "సమాధి - సుషుప్తులు
సరిగాఁ గనఁబడిన పైకి సమమగునే? బం
ధురమగు "సుషుప్తి" సజ్జత
దొరయు "సమాధి" నదిపొరయ-దు గదా, ఐవమేన్ ౧౭౭

గీ॥ మఱియు సృష్ట్యాది శూన్యత్వ - మెఱుక వడుట
యగు "సుషుప్తి" ని శూన్యతా - ప్రగతి నెట్టు
లనిన, నిదురను మేల్కొను - నప్పుడేమి
నేనెఱుంగ నటంచు న - చింత్రు నరులు. ౧౭౮

గీ॥ కావున "సుషుప్తి" శూన్యమై - కార్యరూప
మందు జాగ్రత్త నజ్ఞాన - మైన స్ఫురణను
గల్గుట నహమ్ము నజ్ఞతా - కారణమున
బరిపరిసమాధి కెట్లు ? పోల్పంగ నగును ! ౧౭౦

గీ॥ అహ మనంతమ్ము బ్రాహ్మీమ యమ్మునై స
మాధి శశ్వత్ప్ర సన్నమై - మలయు కతన
ద"త్సమాధి' - "సుషుప్తు"ల తారతమ్య
మెఱుక పఱచితిఁ దెలియ ఘా - సురకుమార ! ౧౭౧

కం॥ చైతన్య రహితమై ప్ర
జ్ఞాతీత విదూరమగుచుఁ - గర్తవ్య నిరు
ద్ధాతిగమైన "సుషుప్తిన్"
ఖ్యాత మతుల్ నిజ 'సమాధి'గాఁ దలఁప రెదన్ ౧౭౨

## ఆశ్వాసాంత పద్యములు

కం॥ పరమర్షులకును యుగముల
తరబడి తపియింపనే ప - దార్థముఁ గన దు
స్తరమగు దత్పర తత్త్వము
స్ఫురియించున్ గాక ! యాత్మ - శోధకుల కెదన్

ఇది శ్రీ వైద్య విద్వత్పండిత సత్కవి శ్రీ నారునాగనార్య
మహాశయ విరచిత మగు శ్రీ త్రిపురారహస్యమునందు.

తతీృయ కోశము. సమాప్తము.

---

# శ్రీ త్రిపురారహస్యము

## చతుర్థ కోశము.

ఏది ! సర్వాత్మ భూత మ - దే ! విచార
ణావగత విస్ఫుటమ్మగు - నదియె, ముక్తి
యితరములు బంధనమ్ములోం - హ్రీం స్వరూప
మైన త్రిపురా పదాబ్జము - లాత్మఁదలఁతు

శ్రీశ్రీశ్రీ - ఓంతత్సత్ శ్రీ రమణార్పణమస్తు.

(సశేషము)

# తప్పొప్పులు

| పేజీ | పద్యము | పాదము | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| స్వామి | ఫోటోలో | | కృతివతి | కృతిపతి |
| VI | పీఠిక | 1-వ | క్లుప్తత సరిగా | క్లుప్తముగా |
| VII | ,, | 5-వ | డ శివుఁ | శివుఁ |
| ఒక | నాఁటి | మాట | దారేండ | దారేండ్ల |
| 8 | 29 | 1 | ఆ వె తన | ఆ॥ వె॥ తన |
| 17 | 68 | 2 | హోమ | హేమ |
| 25 | 102 | 4 | మీ! రాగ | మి. విరాగ |
| 88 | 146 | 3 | ద్వైద్య | తద్వైద్య |
| 89 | 147 | 4 | యుగడింప | యుగ్గడింప |
| 91 | 155 | 2 | వెల్లలు | లెల్లలు |
| 92 | 3 | 3 | వీలాదు | వీల్గాదు |
| 95 | 16 | 3 | యే, మి | యే' మీ |
| 117 | 102 | 2 | విశాదుల్ | విశారదుల్ |
| 118 | 107 | 3 | జన్మమా | జన్నమా |
| ,, | 108 | 18 | [యోడించి | యోడించి |
| 119 | ,, | 3 | యొకరుక | యొకర్తుక |
| 124 | 132 | 1 | దెలికొనుట | దెలిసికొనుట |

పద్యము నెంబరు 132 కు 122 గా పొరబడియున్నది.

| 131 | 159 | 1 | జాన | జ్ఞాన |
|---|---|---|---|---|

అటనిట నింకను దోసఁగు లెసఁగినవి. గమనించి చదువుకొనఁ బాఠకులకు విజ్ఞప్తి.

ఇట్లు,

కృతికర్త.